ప్రతులు వలయువారు :

నందూరి బంగారయ్య,

అడ్వొకేటు

రాజమండ్రి

అని వ్రాయవలెను.

రాజమండ్రి : పోతాప్రగడ సూర్యనారాయణ పంతులుగారి
సుజనరంజనీ ముద్రాశాల యందు ముద్రింపఁబడినది.

# మనవి

---

మా యూరి ఆంధ్రేతిహాస పరిశోధకమండలివారి కోరికపయి "రెడ్డి రాజ్య వర్ధంతి" కయి నేనీ నాటకమును 1938 లో రచించితిని.

దీనిని సుప్రసిద్ధ చరిత్రకారులయిన శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు 1939 వ. సం॥మున తాము సహాయ సంపాదకులుగ నుండిన "భారతి"లో బ్రకటించిరి.

1943 లో రాజమహేంద్రవరము ఆర్ట్సు కాలేజీవారు దీనిని బ్రదర్శించిరి. నే నెఱింగినంతవఱకు వారిదే ప్రథమ ప్రదర్శనము. ఆ ప్రదర్శనమును పూనికతో నిర్వహించుటయేగాక స్వయముగ రామాప్రెగ్గడ పాత్రమును నిపుణముగ నభినయించిన శ్రీ మద్దాలి సూర్యప్రకాశరావు ఎమ్. ఎ., యల్. టి. (లెక్చరర్. గవర్నమెంటు ఆర్ట్సుకాలేజి) గారు ప్రత్యేకముగ అభినందనీయులు. ఆ తరుణమున "కథాగేయ సుధానిధి" శ్రీ నండూరి రామమోహనరావుగారు ఇందు విజయాంబిక పాత్రను నిర్వహించి ప్రేక్షకుల మెప్పునడసిరి. ఇతర పాత్రములను ధరించినవారుకూడ యథోచితముగ నభినయించిరి.

పుస్తకరూపమున వెలువడుటకు ముందే ఈ నాటకము ఆంధ్ర దేశమున పలుతావుల ప్రదర్శితమయి జయప్రదముగా జూఱగొన్నది. నాడు మంత్రియు నేడు ముఖ్యమంత్రియు నగు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారి యధ్యక్షతను 21-1-50 రాత్రి మద్రాసు వి. పి. హాలులో నిది ప్రదర్శితమయినది. ఇప్పటను మన ఉపముఖ్యమంత్రి గా॥ శ్రీ సంజీవరెడ్డిగారును, అప్పటను మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలు ప్రెసిడెంటు శ్రీ ఆర్. బి. రామకృష్ణ రాజుగారును గూడ ప్రదర్శనమునకు హాజరయి యిట్లును నాటకముపట్ల నాదరణ చూపినట్లును గమనమ్ముచున్నది. ఉన్నత పదవుల నలంకరించుచున్నవారలే గాక సారస్వతమున విశేష కృషి సలిపిన సహృదయ శ్రేష్ఠులిందరు దీని నాదరించుట నాకు మిగుల నుత్సాహ ప్రదమయ్యెను.

దీని వ్యాప్తికి తోడ్పడిన మహాశయులందఱికిని నా హృదయపూర్వక వందనము లర్పించుకొనుచు "నాంధ్రావళి"లో నంతర్యామియైన పరమేశ్వరుని పదకమలములకు దీని నంకిత మొనర్చుచున్నాను.

రాజమహేంద్రవరము
శ్రావణ బహుళ అష్టమి
బుధవారము

ఇట్లు
బుధ విధేయుడు,
నండూరి బంగారయ్య.

# "ఆంధ్ర తేజము"

## ఆంధ్ర విజ్ఞాన సమితి వారిచే
## వి. పి. హాలులో ప్రదర్శనం

1950 మద్రాసు, జనవరి 22

చెన్నపురి ఆంధ్ర విజ్ఞాన సమితివారు సమితి పుస్తక భాండాగారం సహాయార్థమై శ్రీ నందూరి బంగారయ్య గారిచే రచింప బడిన ''ఆంధ్ర తేజము'' అనే చారిత్రాత్మక తెలుగు నాటకాన్ని నిన్నరాత్రి మంత్రి శ్రీ గోపాలరెడ్డిగారి అధ్యక్షతను ప్రదర్శించారు.

మంత్రి శ్రీ సంజీవరెడ్డి సమితి అధ్యక్షులు. మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ అధ్యక్షులు శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు ప్రభృతులు ఈ ప్రదర్శనానికి హాజరయినారు.

కొండవీటి సీమకు, రాచకొండకు మధ్య వివాదానికి కారణమైన ''ధరణికోట'' గాధ ఈ నాటకానికి ఇతివృత్తం, ఆంధ్ర దేశ సమైక్యతకు తెలుగు జోదులు నాడు చేసిన కృషి, దాని ఫలితాల నుంచి మనం నేర్చుకొనవలసిన గుణపాఠాలను ప్రదర్శించడం ఈ నాటకం ప్రధానోద్దేశ్యం.

ఈ నాటకంలో పోలయ వేమారెడ్డిగా శ్రీ ఎ. రామనాథశాస్త్రి, అనపోతారెడ్డిగా, శ్రీ పుట్రేవు సీతారామమూర్తి, రామాప్రగడగా శ్రీ టి. వి. ఎల్. నరసింహశాస్త్రి, ఎఱ్ఱాప్రెగడగా శ్రీ జి. వి. సీతాపతి, అన్నారెడ్డిగా శ్రీ కొత్తపల్లి శ్రీరామమూర్తి. అనపోత నాయుడుగా శ్రీ వసంతరావు వెంకట్రావు, మాదానీడుగా శ్రీ నిడదవోలు సూర్యనారాయణ. పోతరాజుగా శ్రీ వి. ఆర్. శ్రీపతి, కన్నమనీడుగా

శ్రీ బి. వి కృష్ణయ్య కమ్మవీరుడుగా శ్రీ ఎ. సోమేశ్వరరావు, విజయాంబగా శ్రీమతి ఇ. ఇందిరాదేవి, భ్రమరాంబగా శ్రీమతి ఎస్. శ్రీలక్ష్మి, పేకరాసి పెద్దమ్మగా శ్రీమతి కె. గంగారత్నం సమర్థతతో నటించారు.

శ్రీ రామకృష్ణరాజుగారు, మంత్రి శ్రీ గోపాలరెడ్డి గారు నటీనటకులను ఆశీర్వదించారు.

ఆంధ్రప్రభ

## "ఆంధ్రతేజము"

చెన్నపట్నం ఆంధ్ర విజ్ఞాన సమితివారు, సమితి పుస్తక భాండాగార సహాయార్థం, నండూరి బంగారయ్యగారు రచించిన 'ఆంధ్రతేజము' అనే నాటకాన్ని క్రిందటి శనివారం ప్రదర్శించారు. పోలయ వేమారెడ్డి, రామాప్రెగ్గడ, ఎర్రాప్రెగ్గడ, మాదానీడు భూమికలు నిర్వహించిన ఎ. రామనాథశాస్త్రి టి. వి. యల్. నరసింహశాస్త్రి, డాక్టర్ గిడుగు సీతాపతి, నిడదవోలు సూర్యనారాయణ ప్రశంసార్హంగా నటించారు.

ఈ నాటకానికి హాజరైన బెజవాడ గోపాలరెడ్డి, ఆర్. బి. రామకృష్ణ రాజుగార్లు ఈనాటకం అంతః కలహాలవల్ల ఆంధ్రులకు గలిగిన, కలుగుతున్న నష్టములను ప్రతిబింబిస్తూ, కర్తవ్యబోధచేస్తున్న దని ప్రసంగించారు. అనఫోతా నాయునిదర్బారులో ముచ్చటగా నృత్యంచేసిన బేబీసిర్మలకు ఒక ప్రముఖుడు రజతపాత్ర బహూకరించారు.

29—1—50

ఆంధ్రపత్రిక

# పీఠిక

ఇది రెడ్డిరాజుల కాలమునకు జెందిన చరిత్రాత్మక నాటకము.

చరిత్రాత్మకనాటకరచనము నందలి కష్టనిష్ఠురములు సహృదయులకు తెలియనివి కావు. ఈనాటి నేను వెనుకటియుగము నందలి భాషను కాని వేషాదికములనుగాని పూర్ణముగ పునరుద్ధరించుట యసాధ్యము. ఈ నాటిభాష ఈనాటి యాచారములు వలదన్నను నారచనమున ప్రవేశించి తీరును. ఏకళయు కళాకారునిపయి అసాధ్యములను సాధింపవలసినబాధ్యత నారోపింపదు. "మనము రెడ్డియుగమున సంచరించుచున్నాము" అను విభ్రాంతి ప్రేక్షకునికి కలిగించుటమాత్రమే సాధ్యము. దానినే నేనీనాటకమున దల పెట్టితిని. ఆనాటి కావ్యములు శాసనములు మున్నగువానిని జదివి ఆనాటి వాతావరణమును విభ్రాంతి సిద్ధాంతపోషకముగ నేనిందు నిర్వహింపజూచితిని. ఇందు నాకు తోడ్పడినవి: (1) చిలుకూరి వీరభద్రరావుగారి యాంధ్రులచరిత్ర, (2) వేటూరి ప్రభాకరశాస్త్రిగారి యమూల్యపీఠికతోనున్న క్రీడాభిరామము, (3) ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశము. క్రీడాభిరామకాలము ఈ నాటకకాలమునకు మిక్కిలి సన్నిహితమగుటచేతను సాంఘికాచారములు త్వరత్వరగమారుట మనకు సంప్రదాయము గాకుండుటచేతను ఈ నాటకకాలమునందలి సాంఘికజీవితచిత్రణమున క్రీడాభిరామముసాహాయ్యము గైకొంటిని. పోలయ వేమనను చిత్రించుటలో హరివంశము సాయపడినది. తక్కిన చారిత్రకచిత్రణమునకంతకును ఆంధ్రులచరిత్రమే యాధారము. అనపోతారెడ్డి పాత్రపోషణమున నాతని మోటుపల్లిశాసనము నామనస్సులో నున్నది. కాకతీయుల కాలమున వజ్రములు మున్నగు నమూల్యపదార్థముల నెగుమతిచేయుచు మహావైభవముతో వెలిగిన రేవుపట్టణ మీమోటుపల్లి. కాకతీయులరాజ్య మంతరింపగనే అది కొన్నాళ్ళ పాడుపడిపోయినది. దాని నెట్లయిన పునరుద్ధరింపవలెనని అన

పోతారెడ్డి విశ్వప్రయత్నములు చేసినట్లు గనవచ్చుచున్నది. ఆతని వివేక మునుజాటు మోటుపల్లి శాసనము నీక్రింద నిచ్చుచున్నాను.

"స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౨౫౦ అగు నేటి విళంబి సంవత్సర శ్రావణ శు ౧ మంగళ్వారం స్వస్తి శ్రీమతు అనపోతయరెడ్డింగారు మోటుపల్లి కాపు వచ్చిన వ్యవహారాలకున్ను వ్యవహారంవచ్చి కరపట్టాల ద్వీపాంతరాల వ్యవహారాలకున్ను యిచ్చిన ధర్మశాసనం.

ఈ మోటుపల్లి యెవరు కాపతనానికి వచ్చినాను వారిని మన్నించి పెద్దకానికె పెట్టువారము. వారు యెప్పుడు మరిపోక పాప్పుడు పోయ్యే మన్నాను కాపనిపట్టిక అనిపిపుచ్చువారము. యేప్రాది సరకు తెచ్చినాను తమవిచ్చలవిడి నమ్మవలసినట్టు సరకుకొనువారుగాని పోగాపులును పట్టిసరకు ఆడపట్టేము. పీరాను గండముపవసము పట్టు వ్యవహారాలకున్ను అపుత్రికమున్ను సుంకాదాయము మానితిమి. ౧౦ గాముసుంకము మానితిమి. గంధముయొక్క నిడిసుంకము పూర్వమురాయదలలోను మాని నిలిపి మానితిమి. ఈ సరకులకున్ను మట్టసుంకాలు పూర్వమురాయదలప్రమాణ నే కొనువారము. ఈక్రమానకు సర్వమైనవారున్ను విశ్వసించవలెను. వీరిగవారికి అభయహస్తము నిస్తిమి." (ఆంధ్రుల చరిత్రము తృతీయభాగము పుట ౧౮౨.)

ప్రజాహితతత్పరు డగు నిట్టి మహాపురుషుడు చిరకాలము రాజ్యముచేయు భాగ్యము పట్టలేదుకాని లేకున్న నీతని వలన నాంధ్రులెంతటిమహోన్నత స్థితిని బ్రాపించియుందురో!

రెడ్లకును వెలమలకును గల పరస్పరస్పర్ధలను చిత్రించుటలో నాంధ్రులచరిత్రమునే యనుసరించితిని. మున్ముందుగ నన్యాయమునకు కాలు ద్రవ్వుచు వచ్చినవారు (first aggressors) వెలమ లగుటచే నేటి రాజనీతికూడ వారిమీదనే నేరము మోపుచున్నది.

సమకాలికజీవితము కొంత వ్యంగ్యమర్యాదగా ఇందు ప్రతిబింబించుచున్నను, అనాదినుండి నేటికిని దేదీప్యమానముగ వెలుగుచున్న ఆంధ్రతేజమునకు శాశ్వతమయిన సాహిత్యదేవాలయము నిర్మించుటే నా ప్రధానాశ

యము. అందుచే సమకాలికసమస్యలు పరిష్కృతి నందినను ఈ నాటకము ప్రయోజనరహితముగా నేరదు.

భారతీయుల మగు మనము ఆత్మవాగులము. సాహిత్యములోనే కాదు సంగీతములోనే కాదు జీవితములోనే కాదు దేనిలోనైనను ఆత్మాన్వేషణము మన కభిమానవిద్య. చారిత్రక నాటకములు వ్రాయువారుకూడ భారతవర్ష చారిత్రమున కాత్మయెద్ది యని ప్రశ్నించుకొనవలసియున్నది.

ఒక్కొక్క దేశచరిత్రమున కొక్కొక విశిష్టగుణము ప్రాణపదముగ నలరారును. ఇంగ్లండుదేశచరిత్రమునకు రాజకీయాభివృద్ధి జీవనాడి. దీనినా దేశచరిత్రమున కాత్మ యనజెల్లును. అట్లే భారతవర్ష చరిత్రమును పరిశీలించితిమేని ధర్మసమన్వయము దీని కాత్మ యనజెల్లును. భౌతికముగ గాని రాజకీయముగగాని ఐక్యానుసంధాన మసాధ్యమనిపించు దీని ప్రాచీనచరిత్రము ఆధ్యాత్మికభూములలో నేకీభవించుచున్నది. భిన్నభిన్న సంప్రదాయములు గల మతముల నన్నిటిని సమన్వయించుటకే ఈభూమి నిర్దిష్టమైనదా యని యాశ్చర్యము గొలుపజాలి యున్నది దీనిచరిత్ర. చరిత్రకారునిబుద్ధి కతీతమగు పురాతనయుగమున నీ భరతఖండము సనాతనధర్మమును నవ్యూతకలన మును సాధించినది. విశ్వైక్యము త్యాగము నను రెండును ఈ ధర్మమునకు మూలసిద్ధాంతములుగ గనవచ్చుచున్నవి. "ఏకస్సత్" ఉన్న దొక్కటే యనుట ఋగ్వేదయుగముననే మనవారు కనుగొన్న యమూల్యసత్యము. ఉన్న దొక్కటే యనుటలో జాతివైషమ్యములు మతవైషమ్యములు మున్నగు స్పర్థలన్నియు పరిహృతమగుచున్నవి. ఉన్నదొక్కటే యైనపుడు ఒకరినొకరు హింసించుకొనుట గాక సమష్టినిమిత్తము వ్యష్టులు త్యాగము నవలంబించుటే యుక్తమని రెండవ సిద్ధాంత మేర్పడుచున్నది. గృహస్థు లయినను సన్యాసు లయినను త్యాగమునే యాధారము జేసికొనవలసి యున్నది. "త్యాగేనైకే అమృతత్త్వమానశుః" ఈ రెండు సూత్రముల పైననే భారతవర్షమునందలి ధర్మప్రపంచమంతయు నాధారపడినది. ఈ

రెండుసూత్రములను ఆచరణపూర్వకముగ బ్రచారముచేయుటకే ఈ దేశము యుగయుగములుగ తన సర్వస్వము ధారపోయుచున్నది. ఈనాడు జవహరలాల్ నెహ్రూ ఇటు చైనాకు అమెరికాకు అటు రష్యాకు అమెరికాకు సఖ్యము కుదుర్చుటకై యత్నించుచున్నాడనగ నీ రెండుసూత్రముల విజృంభణమేకాక మరియేమున్నది ?

అనాదిని కొన్ని యుగములు భారతవర్షమీ సనాతన ధర్మమును కనుగొనుటకయి కృషిచేసినది. కనుగొనినవెనుక దీనిని చీనా జపాను రష్యా మున్నగు నితరదేశములకు వ్యాపింపజేయుటలో మరికొన్ని శతాబ్దములు గడచినవి.

ప్రపంచమునందలి మతములకన్నిటికిని సనాతనధర్మమే జననీమతల్లి యని వివేకానందాదుల యభిప్రాయము. సనాతనధర్మమునందలి యొక శాఖయేగదా బౌద్ధమతము. ఈ బౌద్ధమతమునుండి క్రైస్తవమతమును క్రైస్తవమతమునుండి మహమ్మదీయ మతమును నుదయించినవట.

ఏది యెట్లున్నను ఉపనిషన్మంత్రద్రష్టలు మొదలుకొని నేటి రామకృష్ణ వివేకానందాదులవరకు ధర్మసమన్వయమే పరిధానకృషిగ ఈ జాతి స్వీకరించినది. దేశకాలపాత్రభేదముల ననుసరించి యప్రధానాంశములలో నెట్టి తారతమ్యములున్నను ప్రధాన సిద్ధాంతము లన్నిమతములకు సమానములేయని ఋగ్వేదయుగమునుండి ఈనాటికిని ఈజాతి ఘంటాపథముగ జాటుచున్నది. కుబేరపుష్పకమువలెనున్న ఈ భారతభూమి ఎన్నిజాతులు వచ్చినను స్వాగత మిచ్చుచునే యున్నది. ఈ సనాతనధర్మము ఎన్నిధర్మములనైన సమన్వయించుచునే యున్నది.

మన నాటకకాలమున భారతవర్షమునకు ప్రాణాధికమగు నీ సనాతధర్మము సమూలముగ నశించిపోవునా యనిన స్థితిలో నుండెను. విజయనగర సామ్రాజ్యమే యుదయింపకుండినచో నంతపనియు జరిగి యుండెడిదే. విజయనగరసామ్రాజ్యోదయమునకు ముందు యుగసంధికాలముగ పరిగ

ణింపదగిన దీనాటక కాలము. అటు కాకతీయ సామ్రాజ్య మస్తమించినది. ఇటు విజయనగర సామ్రాజ్య మింకను ఉదయింప లేదు. ఈ యుగసంధి కాలము నందలి అరుణరేఖలలో సనాతనధర్మరక్షణకయి యాంధ్రుడుపడిన తహతహను ప్రత్యక్షపరచుటయే ఈ నాటకము తలపెట్టిన ప్రధానాశ యము. దీనినే ఈ నాటకమున కాత్మగ చెన్నదగియున్నది.

యుగయుగములుగ భరతఖండ మాలపించు విశ్వకల్యాణగీతిలో నాంధ్రుడుకూడ తన కంఠము నైక్యముచేయుటలోనే యాంధ్రజాతి గొప్పదనమున్నది. సనాతనధర్మమునకు గ్లాని సిద్ధింపనున్న విషమపరిస్థితు లలో తన సర్వస్వమును ధారపోసి యాంధ్రజాతి దానిని సంరక్షించిన తరుణములుకొన్ని యున్నవి. అట్టి తరుణములన్నియు నాంధ్ర తేజమునకు విజృంభణదశలు. అట్టి విజృంభణదశలలో నొకదానికి సన్నిహితముగ నిల్చిన దీ నాటక కాలము.

ఆంధ్రైక్యమునుగూర్చియు, ఆంధ్రసామ్రాజ్యస్థాపనమునుగూర్చియు పదేపదే ప్రసక్తి వచ్చుచున్నను అన్నిటికి ఏకైక గమ్యము సనాతనధర్మ సంరక్షణమే యనుట సహృదయులు విస్మరింపరాదు. సనాతన ధర్మరక్షణ కయి విద్యారణ్యులు శంకుస్థాపనము గావించిన యుగమది. సాయనాచా ర్యులు వేదభాష్యము రచించినయుగమది. దక్షిణదేశమునందలి యాంధ్రు లేమి తమిళులేమి కన్నడులేమి అందరు నేకీభవించి తమ తమ రక్తమును ధర్మసంరక్షణకయి ధారపోసిన మహాయుగమునకు ప్రసవవేదనగ చెన్న దగిన యుగమది.

యావద్భారతవర్ష చరిత్రమున నాత్మానుసంధాన మొనర్చి దానికి శాఖయగు నాంధ్రుల చరిత్రలో నాత్మానుసంధాన మొనర్చి దానికి ఉప శాఖయగు నీ రెడ్డిరాజుల యుగమును అత్త ప్రధానముగ చిత్రించుటకీ నాటకమున కృషి జరిగినది.

ఆత్మచిత్రణము, వాతావరణ చిత్రణము ప్రధానేతివృత్తము చారిత్రకము లేయయ్యును పరిణయ కథ స్వకపోలకల్పితము. పాత్రములలో విజయాంబ, పేదరాశి పెద్దమ్మ మున్నగునవి స్వకపోలకల్పితములు. చారిత్రక పాత్రములయినను—ఆధారములున్నప్పుడు తదనుగుణముగనే చిత్రితములాయెను; లేనప్పుడు స్వతంత్రముగనే నడచెను. ఎక్కడ స్వాతంత్ర్య మునవలంబించినను చారిత్రాత్మకమాత్రము భంగము రానీయరాదని ప్రతిజ్ఞ. ఎంతవఱకు కృతార్థమయినదియు సహృదయులు నిర్ణయింపవలెను.

---

# ఆంధ్రతేజము

## మొదటి అంకము

### మొదటి రంగము

ప్రదేశము : అద్దంకిలో పోలయవేమారెడ్డి యభ్యంతరమందిరము

ప్రవేశము : ఆసీనులయి పోలయవేమన, ఎఱ్ఱాప్రెగ్గడ

పో. వేమా — మహాకవీ!

కాకతి రాజ్యవైభవము కన్నుల ముందట నాట్యమాడుచో
లైకొను భారతాభ్యుదయ భావము లెల్లను స్వప్నగాథలై
చీకటిలో బ్రతిధ్వనుల జేసి హసింపగ గృంగిపోవుచున్
వ్యాకుల మొందు నాహృదయభారము దీరునె యెన్నడేనియున్?

ఎఱ్ఱాప్రెగ్గ — మొన్ననే కదా నాయకు లందరును ఏకమయి మరల నోరుగంటి సింహాసనమున ప్రతాపరుద్ర సార్వభౌముని తనయుని బ్రతిష్ఠించిరి? ఇక నేమి? మరల నొక యాంధ్రసామ్రాజ్యమును స్థాపించి యనంతరము భారతవర్ష స్వాతంత్ర్య సంపాదనమునకై ప్రయత్నింప వచ్చును కదా!

పో. వేమా — ఏమి పునఃప్రతిష్ఠ? శిథిలసౌధమునకు జీర్ణ స్తంభము బోటు పెట్టినట్లయినది. చిరకాలము నిలుచునని నాకుదోచదు. రాచకొండలో రేచర్లనాయడా? విద్యా

నగరమున హరిహరరాయలా? కొండవీటి కొండలో కూనప
నాయకుడా? ఇంటికొక స్వతంత్రరాష్ట్ర మాయెను.
ఇక నెక్కడి యాంధ్రసామ్రాజ్యము?

ఎఱ్ఱాప్రెగ్గ — నిజమే. నీవుచెప్పినట్లు ఆంధ్రతేజము ఛిన్నా
భిన్నము లయినది.

వే. వేమా — శరీరమున జవసత్త్వము లున్నంత వరకు
ప్రయత్నలోపము చేయలేదు. కాని నాజీవితమున
ఆంధ్రసామ్రాజ్యస్థాపనము సిద్ధించు సూచనలు గాన
రావు.

ప్రాలెను ప్రొద్దు పశ్చిమపు వార్నిధిపజ్జకు; సాంధ్యరాగముల్
మాలిని దాల్చి రత్నమయమండనయై యలరారుగోదసీ
లాలితరూపసంపదకు లాస్యము నేర్పె శశాంకమౌళి; గో
పాలకదేవు, డీ యెడల వత్సములన్ గృపజూడబోయెడిన్.

ఇహము లేకున్న మానిరి. పరమయినను జూచుకొన
వలదా?

ఎఱ్ఱాప్రెగ్గ — నాకుజూడ ఇహపరముల రెండింటియందును
నీ కేకొదువయు గానరాదు. ఇప్పుడు పరమునకయి
చేయవలసిన నూతనప్రయత్న మే మున్నది? శ్రీశైల
మునకు సోపానములు నిర్మించియు, భక్తిరసోద్బోధకము
లయిన పవిత్రగ్రంథములు నిర్మింపించియు శివకేశవుల
వాత్సల్యము నిదివరకే సంపాదించుకొంటివిగదా!

[ ప్రవేశము ప్రతీహారి ]

ప్రతీహారి — జయము! జయము! మహారాజా! మహా మంత్రులవారు దర్శనార్థము వేచియున్నారు.

పో. వేమా — త్వరగా ప్రవేశపెట్టుము.

ప్రతీహారి — మహాప్రసాదము.

[ నిష్క్రమించును ]

పో. వేమా — చూచితిరా? రవంత సాహిత్యగోష్ఠి నాశించిన నాకు ఎన్ని యంతరాయములు తటస్థించుచున్నవో!

[ ప్రవేశము రామాప్రెగ్గడ ]

పో. వేమా — ప్రధానిశేఖరా! మోటుపల్లినుండి వార్త లేమైన దెలిసినవా?

రామాప్రె — మహారాజా! అంచెవేగు లింకను రాలేదు. అర్జునవిక్రముడయిన మల్లారెడ్డి విజయమునుగూర్చి నా కెంతమాత్రమును సందేహము లేదు. ప్రస్తుత మంత కంటెను ముఖ్యమైన వేరొక యంశమును గూర్చి ముచ్చటింపవచ్చితిని.—

పో. వేమా — ఏమది?

రామాప్రె — ఏమహామహుల తపోయజ్ఞాదులను నిర్విఘ్నముగ, గొనసాగించుటకై మే మీ లౌక్యరూపమున ప్రవేశింపవలసి వచ్చినదో అట్టి వేదమూర్తుల యార్తరావమును ప్రభువులకు విన్నవింపవచ్చితిని.

ఎఱ్ఱాప్రెగ్గ — వేముని రాజ్యమున గూడ వేదమూర్తుల యార్తరావమా?

రామాప్రె — మనరాజ్యమున గాదనుకొనుడు. రాజమహేంద్రవర ప్రాంతములలో మహమ్మదీయులు సలుపు దుండగములకు మితిలేకుండ నున్నదని కోనసీమ బ్రాహ్మణులు మొర పెట్టుచున్నారు.

పో. వేమా — కోరుకొండలో కూనపనాయకు డుండనే యున్నాడుగదా!

రామాప్రె — ఆతనికి సైన్యబలము చాలకుండనున్నది. ఒక వంక మన్నెదొరలతోడను ఇంకొకవంక తురుష్కుల తోడను పోరాడుట యాతనికి కష్టముగా నున్నది.

పో. వేమా — విషమపరిస్థితులు వచ్చినవే! ఉన్న సైన్యములో కొంతభాగము నాగులపల్లి పోయినది గదా! ధరణికోటనుండి యువరాజు కదలినచో రేచెర్లవారు నిలువనీయరుగదా? ఏమి చేయవచ్చును?

[ప్రవేశము ప్రతీహారి]

ప్రతీహారి — జయము, జయము మహామంత్రీశ్వరులకు! ఇదిగో కమ్మ!

(అని చేతికొక కమ్మ నందిచ్చి నిష్క్రమించును)

రామాప్రె — (చూచుకొని) మహారాజా! మల్లారెడ్డి నాటు పల్లిని జయించిన శుభవార్త!

(అని లేఖను వేమారెడ్డి కిచ్చును)

పో. వేమా — (చదివి ఎఱ్ఱాప్రెగ్గడతో) మహాకవీ! నే నింక నిశ్చింతగా మరణింపవచ్చును.

ఎఱ్ఱాప్రెగ్గ — కాదామరి! సప్తద్వీప సద్వస్తు సందోహాము గొనివచ్చి యిచ్చు సముద్రుడు నేడు నీకు మరింత నెచ్చెలియయినాడు.

[ ప్రతీహారి ప్రవేశించును ]

ప్రతీహారి — మహారాజా! శ్రీమతు యువరాజులుంగారు దర్శనార్థమై వేచి యున్నారు.

పో. వేమా
ఎఱ్ఱాప్రెగ్గ
రామాప్రె
} (ఒకరివంక నొకరు చూచుకొందురు)

పో. వేమా — ముందుగ వార్తబంపకుండ యువరా జింత తొందరగ వచ్చుటలో నేదోవిశేషముండితీరవలయును. సత్వరముగ బ్రవేశపెట్టుము.

ప్రతీహారి — మహాప్రసాదము. (నిష్క్రమించును)

పో. వేమా — మానవజీవిత మెంత చిత్రమైనది! అంతలో హర్షము! అంతలో నాందోళనము!

[ అనపోతారెడ్డి ప్రవేశించును ]

అనపోతా — మహాకవీ! నమస్కారము. సచివోత్తమా! నమస్కారము. తండ్రీ! నమస్కారము.

పో. వేమా
ఎర్రాప్రెగ్గ } వత్సా! చిరంజీవ!
రామాప్రె

పో. వేమా — కుమారా! "మోటుపల్లి" "మోటుపల్లి" యని నీ వహోరాత్రములు కలవరించుచుందువుకదా! ఇదిగో! ఈ మహాకవి యాశీర్వచనబలముచే, నీ సచివోత్తముని మంత్రాంగబలముచే, నీ పినతండ్రి బాహుబలముచే నది నేడు మనకు వశమయినది.

(అని కమ్మ చేతికిచ్చును)

అనపోతా — (చూచుకొని) పరమసంతోషము. ఆంధ్రాభ్యుదయ నాటకమున కిది నాంది.

పో. వేమా — కాని నీ వింత తొందరగా వచ్చుటకు కారణము దురూహ్యముగా నున్నదే?

అనపోతా — ఏ మున్నది? మరల యుద్ధము సిద్ధము. అనపోతనాయడు జీవించియున్నంతదనుక మనకును, మనము జీవించియున్నంత దనుక ఆతనికిని మనశ్శాంతి యుండదను కొందును. "మా ధరణికోట మా కీయవలసిన" దని మరల వర్తమానము.

రామాప్రె — ధరణికోటను వారి తాతలు తండ్రులు గడించిరి కాబోలును.

పో. వేమా — నాయనా! ఏమి సమాధానము పంపితివి ?

అనపోతా — నాయనగారియాజ్ఞ గైకొనకుండగనే సమాధానమా!

రామాప్రె — నాకొక యాలోచనము తోచుచున్నది. వెంటనే ప్రత్యుత్తరము బంపకపోయిన నెట్లుండును?

పో. వేమా — అట్లయిన నొక పద్ధతి నవలంబింతము. ఇప్పుడువచ్చిన వార్తాహారిని తూలనాడక "వారము దినములలో వర్తమానము చేసెద" మనిచెప్పిపంపుము. వారముదినములయినవెనుక ఇంకొకవారము దినములలో నన్నచమూపతి వారికడకు మనరాయబారము గైకొని వచ్చునని వార్త బంపుము.

అనపోతా — రాయబార మేమని ?

పో. వేమా — యుద్ధమువలన కలుగు స్వజనక్షయము ధనవ్యయము ప్రజాపీడ మున్నగు నష్టములను వివరించి మన యన్యోన్యకలహములు దేశమునకు క్షేమకరము కావని వారించుటకు.

అనపోతా — దానివలన ప్రయోజనముండు ననుకొందురా ?

రామాప్రె — తప్పు మనమీద నుంచుకొనక వారి మీద బెట్టినవార మగుదుముగదా ?

అనపోతా — సామోపాయము నవలంబించుట వారికి మరింత లోకువ యిచ్చునేమో! ఏమైనను ఏయిన దూత సమయోచితమైన కాఠిన్యము వహింపవలెను.

రామాప్రె — కొంతకాలవిలంబనము మనకెట్లును ఆవశ్యకముగదా.

పో. వేమా — గడియ కొకయుద్ధమైనచో సిక నెక్కడ? విద్యాపీఠము పేరు చెప్పుకొని మాటిమాటికి మన మీయాంధ్రదేశమును రక్తసిక్తము గావింపనలసిన దేనా?

అనపోతా — ఇదివరకే దేశస్థితి బహుమర్భరముగానున్నది.

ఖండాంతరంబుల ఖ్యాతి గాంచుచున్న
తెనుగువాణిజ్యంబు వెనుకబడియె;
మణిహేమరాశుల మునిగి తేలుచునుండు
నోడరేవులు గడ్డిబీడులయ్యె;
శ్యామల పరిధాన సస్యశోభను వీడి
భూదేవి నెత్తుట బొరలుచుండె;
శాంతిభిక్షాటన సలుపు ప్రాజ్ఞగణంబు
లన్యదేశంబుల నాశ్రయించె;
వేణువీణాస్వనంబుల వెల్లివిరియు,
పట్టణంబులు హాహారవంబుతోడ
నిండిపోయెను; యుద్ధంబు గుండె జీల్చి,
త్రావుచున్నది యాంధ్రుని రక్తమెల్ల.

పో. వేమా — "గోరుచుట్టు మీద రోకటి పో"టనినట్లుగ నున్నది. అటుకోనసీమ బ్రాహ్మణుల యార్తరావమా! ఇటు ధరణికోటయుద్ధమా! ఏమి చేయవచ్చును? మల్ల రథినీనాథుని వెనుకకు రమ్మనిన మంచిదికాదా!

అనపోతా — వలదు. వలదు. క్రొత్తగా స్వాధీనపరచుకొనిన ప్రదేశమున మనజయము స్థిరపరచుకొనుటకు కొంత కాలముపట్టును. మోటుపల్లి మనరాజ్యమునకు శ్వాస కోశముగదా!

పో. వేమా — మోటుపల్లి శ్వాసకోశము! ధరణికోట - హృదయకోశము! ఇందు దేనిని వీడుకొందుము?

అనపోతా — ధరణికోటకు నే నుండనే యున్నానుగదా! ఎటు వచ్చినను కోటలో నాహారపదార్థములను నిలువ చేసి యుంచుకొనుటమంచిదని యాలోచించుచున్నాను.

పో. వేమా — ఇప్పుడు బొక్కసములో ద్రవ్యమంతగ నున్నట్లు లేదే? ఎంతసేపును మనబ్రదుకు యుద్ధముల తోడనే సరిపోవుచున్నదిగదా!

రామామ్రా — ద్రవ్యమునుగూర్చి సంకోచింప బనిలేదు. మన బాల్యమిత్రుడు అవచి దేవయ్యశెట్టి యున్నాడుగదా! ఎంతద్రవ్యము కావలెనన్నను అతనియొద్దనుండి కొని రావచ్చును.

పో. వేమా — బాగుగా జ్ఞప్తి చేసితిరి. వెంటనే ముప్పదివేల వరాలను బంపవలసినదిగ వార్తనంపుడు.

రామా. ప్రె — ప్రకృతము మన మీకోనసీమ బ్రాహ్మణుల కార్యము నిలుపుచేయుదము.

పో. వేమా — సచివోత్తమా! వలదు. వలదు. త్యాగధనులును తపోనిష్ఠితులును అగు బ్రాహ్మణులయందే కదా విశ్వము సుప్రతిష్ఠితమై యున్నది. అట్టివారి యార్తరావమును పాలింపలేకున్నచో మన జన్మములు కాల్పనా?

అనపోతా — మామ నూకారెడ్డి యున్నాడుగదా.

పో. వేమా — అవును. అయిదువేల పదాతివర్గముతో నూక చమూపతిని కోనసీమకు బొమ్మనుడు. ధరణికోటకు నీవు చాలుదువు కదా!

అనపోతా — చాలుదును.

పో. వేమా — సరే, నీవు ముప్పదివేలవరాలను గ్గొనిపొమ్ము. బహుజాగరూకతతో వర్తింపవలయును సుమా.

రామా. ప్రె — మహారాజా! నా దొక్కమనవి యున్నది

పో. వేమా — అమాత్యశేఖరులు సెలవీయవలయును.

రామా. ప్రె — కాలము బహువిపరీతముగ గనవచ్చుచున్నది. ఈ యుద్ధము ముగియువరకు నాకుగూడ ధరణికోట నివాసమున కనుజ్ఞ నీయవలయును. నాకిచ్చట కాలు నిలువకుండనున్నది.

ప్రో. వేమా — కంటికి రెప్పవలె కుమారునిమీరు కాపాడు మనినచో అంతకంటెనా!

రామాప్రె — అసహాయశూరుడగు యువరాజు కొకరిసాయ మక్కరలేదు. కాని ఏదోనెపముమీద ఆతని కీర్తిలో కొంత పంచుకొనవలెనని నా కాశ పుట్టినది.

ప్రో. వేమా — మీ రింత చెప్పవలెనా? (కుమారునితో) అమాత్యశేఖరులు నీకడ నున్నచో నిక గావలసిన దేమున్నది?

అనపోతా — నాయనగారూ! నా కది వరముగాదా!

ప్రో. వేమా — నా కిక పూజకు వేళ యగుచున్నది.

ఎర్రాప్రెగ్గ }
రామాప్రె } మహారాజా! మాకు సెలవు దయచేయుడు.

అనపోతా — నాయనగారూ! నమస్కారము. నా కాజ్ఞ నిప్పింపుడు.

ప్రో. వేమా — (అనపోతారెడ్డితో) నాయనా! నీవు ప్రాజ్ఞుడవు. నీకు చెప్పవలసిన దేమున్నది?

సేవ యొనర్చి యీ తెలుగుసీమకు రక్తము ధారపోయగా
దీవనముల్ గడించుకొని దీక్ష వహించిన శాత్రవతంబు సం
భావనమై స్మరించుకొని భావిజనంబులు నాసమాధిపై
పూవులు జల్లగావలయు పుణ్యచరిత్రము నిర్వహింపుమా.

(నిష్క్రమించును.)

[ రా—ఎర్రా—అనపోతా, అభ్యంతర మందిరమును గడచుటకు సూచకముగా కొంచెమీవలకువచ్చి నిలుచుండగ వెనకటి తెరగదించవలెను. ]

రామాప్రె — (అనపోతారెడ్డి భుజముపై చేయివైచి) పదు నారేండ్ల పడుమకూచికి అయనది యేండ్ల ముదివగ్గును ముడిపెట్టిన ట్లయినది. మన యిరువురి కాపురము ఎట్లు కడతేరునో తెలియకుండ నున్నది.

అనపోతా — (చిరునవ్వుతో) ఇరువురును కోరి చేసికొనిన వలపు పెండ్లియైనచో నిబ్బంది లేదుకదా ?

రామాప్రె — ముసలివారి కనుమానము మెండు. పడుచు వారికి సాహసము మెండు.

అనపోతా — పితృపాదులగు మీయాజ్ఞ నెన్నడైన నతిక్ర మించితినా ?

రామాప్రె — (అనపోతారెడ్డిగడ్డము పట్టుకొని) వత్సా ! నీ యీడున నున్నప్పు డేర్పరుచుకొనిన యాశయములలో నావగింజంతకూడ మేము సాధింపజాలక పోయితిమి.

అనపోతా — అనుకొనుచున్నారు. రెడ్డిరాజ్యమునకు మీరే కదా పునాది వైచినది ?

రామాప్రె — మహారాజును నేనును బాల్యమిత్రుల మయి నందులకు ఆంధ్రసామ్రాజ్య స్థాపనమును సంకల్పించి తిమి. ఇంకను శంఖుస్థాపనమైన గాలేదు. భావి కర్తవ్యమంతయు యువకుడవగు నీ మీద నాధారపడి యున్నది.

అనపోతా — అమాత్యశేఖరులు ఏదో చెప్పదలచుకొని చెప్పకుండనున్నారు. నాదగ్గరకూడ నింత దీర్ఘమైన యుపోద్ఘాత మావశ్యకమని తలచుట నాదురదృష్టమే.

రామాప్రె — వత్సా! అనుభవమును పురస్కరించుకొని యొకటి రెండు నిన్ను కోరుచున్నాను. అవియైన నీ క్షేమమునాశించి కోరుచున్నవే. సాధారణముగ మీా రెడ్డివంశజులకు అనుగ్రహము జనించినను కష్టమే. ఆగ్రహము జనించినను కష్టమే. వెనుక ముందులు చూడరు. ఈ యుద్ధ సమయమున గ్రొత్తవారి నెవరి నయిన గోటలోనికి రానిచ్చుటగాని, సైన్యములో జేర్చుకొనుటగాని ప్రమాదకరము గాదా?

అనపోతా — మణులా! మాడలా! చివర కిదియా మీారు కోరినది! మీాయనుజ్ఞ గైకొనకుండ ఎవ్వరిని కోటలో నడుగు పెట్టనీయను. సేనలో జేరనీయను. సరియా!

రామాప్రె — ఇప్పుడు నీవు వెనుకటివలె బ్రతిదినము కృష్ణా తీరమున కొంటిగ సంధ్యావిహారమునకై పోవు చున్నావా?

అనపోతా — దీనిలోమాత్రము మహామాత్యులు నాకు గొంత యాటవిడుపు నీయకతప్పదు. దినమున కొక్క పర్యాయమయిన కృష్ణాతరంగ పంక్తులలో లీఖత

మయిన యాంధ్రదేశచరిత్రమును బరింపకుండ నే నుండలేను.

రామా|ప్రె — ఇవి యుద్ధదినములుగదా యని ఆలోచించుచున్నాను. సింగమనాయని హత్యనుగూర్చి నీవు వినియేయున్నావు గదా!

అనపోతా — అట్లయినచో మన మిరువురము నొక్కసమయము చేసికొందము. వారమున కొక్కసారి—అదియైనను చీకటిపడకుండ మందిరముఁ జేరుకొను పద్ధతిని - నాకనుజ్ఞ నీయవలయును.

రామా|ప్రె — పరమసంతోషము. ఇన్నివిధముల నిన్నిబ్బంది పెట్టవలసివచ్చుచున్నదిగదా?

అనపోతా — మాక్షేమమును యోజించి చెప్పుచున్నారు గాని మరియొకటి కాదుగాదా? అన్నట్లు మరచితిని. అన్న చమూపతితో నేను కొన్నియాంతరంగిక విషయములు ప్రస్తావింపవలసి యున్నది. నా కనుజ్ఞ నిచ్చెదరా?

రామా|ప్రె — వత్సా! నీవు సర్వమును సంసిద్ధము గావింపుము. ఇంతలో నేను మహాకవులయొద్దనుండి సెలవు పుచ్చుకొని వచ్చి నిన్ను గలసికొందును.

అనపోతా — చిత్తము. సెలవు.

(అని యిరువురకు నమస్కరించి నిష్క్రమించును.)

ఎఱ్ఱాప్రెగ్గ — అన్వయైక పావనుడగు తండ్రికీత డధికుడగును గాని తక్కువ గాడు.

రామాప్రె — ఆంధ్రసామ్రాజ్యమును పందెముగాసి ఇప్పుడు మూడు గుఱ్ఱములు పరుగెత్తుచున్నవి.

ఎఱ్ఱాప్రెగ్గ — రాచకొండ, విద్యానగరము, నద్దంకియునా ?

రామాప్రె — అవును. భగవంతు డీతనికి చిరజీవితము ననుగ్రహింపవలయును గాని యీతనిబొందిలో ప్రాణ ముండగ సామ్రాజ్యాధిపత్యము అద్దంకి దాటిపోనేరదు. చక్రవర్తి లక్షణము లన్నియు నీతనికి సంపూర్ణముగ బట్టినవి.

ఎఱ్ఱాప్రెగ్గ — చిరకాలమునకు వినదగిన మాటలు వింటిని.

రామాప్రె — మీరు నాకొక్క యుపకృతి చేయవలసి యున్నది.

ఎఱ్ఱాప్రెగ్గ — మీకోరిక నెన్నడైన నిరాకరించితినా ?

రామాప్రె — వయసు ముదిరినకొలది పోలయవేముని కాముష్మికదృష్టి యధికమగుచున్నది. దేశక్షేమమునాశించి మీరు దానివడి కొంత తగ్గింపవలయును.

ఎఱ్ఱాప్రెగ్గ — సాధ్యమగునా ?

రామాప్రె — కవుల కసాధ్య ముండునా? ఆంధ్రసామ్రాజ్య స్థాపనము నిమిత్తము మీరామాత్రము శ్రమపడక తప్పదు.

ఎఱ్ఱాప్రెగ్గడ — శక్తివంచనములేక ప్రయత్నించి చూచెదను. భగవానుడా! ఆంధ్రసామ్రాజ్యస్థాపనమున కాటంకములు కల్పింపకుము.

భిన్నాభిన్నములైన యాంధ్రుల యశశ్శ్రీపర్వతాగ్రంబు నా
కన్నీటన్ బ్రతిబింబితంబయి నమస్కారంబు గావించెడిన్ ;
ఎన్నో మూర్తుల దాల్చి విశ్వకథలో నేకాత్మతన్ బల్కు నో
యన్నా! భిన్నమహాంధ్రతేజమున కైక్యంబున్ బ్రసాదింపవే !

(ఇరువురును నిష్క్రమింతురు.)

# ఆంధ్రతేజము

## రెండవ యంకము

---

### ఏక రంగము

[రంగము — రాచకొండలో ననపోతనాయని కొలువుకూటమునకు చేరి
యున్న యుద్యానవనము.

ప్రవేశము — భ్రమరాంబ, విజయాంబ.]

విజయాంబ — (నిట్టూర్పు విడుచుచు) నేను విశ్వసింపను. నేను విశ్వసింపను. నేనే కాదు యీనాటి యాంధ్రజాతిని ప్రత్యక్షముగ జూచుచున్నవా రెవ్వరును విశ్వసింపరు.

కలలోని వార్త యీ తెలుగువీరునికత్తి
మగధరాజ్యము నేలి నెగడె ననుట;
ఆకాశహర్మ్య మీ యాంధ్రజాతియశస్సు
యవననర్తకినోట పాడె ననుట;
తలతిక్కప్రాత యీ తెలుగుశిల్పప్రౌఢి
వివిధజాతుల గురుపీఠ మనుట;
పుక్కిటిగాథ యీ భూమండలం బెల్ల
తెలుగురత్నములతో వెలిగె ననుట;
ఇతరజాతుల పదముల కెరగియెరగి,
లేవజాలని యాంధ్రుని చేవ జూచి
ఎవరె నమ్మును ప్రాచీనకవులసూక్తి?
భారతీదేవి! యీ మృషావాద మేల?

భ్రమరాం — అక్కా! మన కీ చరిత్రగాథ లెందులకు? మరియొక కాలక్షేప మేదైన జూచుకొనరాదా?

విజయాంబ — చెల్లీ! ఆంధ్రక్షమామండలేశ్వరుడగు అన పోతనాయని యల్లారుముద్దుబిడ్డ కాంధ్రులచరిత్ర మనిన ఇంత వైముఖ్యమని ఎన్నడును నేను గ్రహింపలేక పోయితిని.

భ్రమరాం — విజయము! చల్లగాలి కుద్యానవనవిహార మొనర్పవచ్చిన మనకు చరిత్రగాథ లెందులకంటిని గాని—

విజయాంబ — అన్యమత ద్వేషులు ఈ దేశమున నడుగు పెట్టినది మొదలు మనకు చల్లగాలి యెక్కడిది? సంవత్సరము పొడుగునను గ్రీష్మకాలమే కాదా?

భ్రమరాం — మరల నారంభమా?

విజయాంబ — ఉద్యానవనవిహారమా? ఇంకను ఆంధ్రుల కుద్యానవనవిహారమా? నందనోద్యానమువంటియాంధ్ర దేశము క్రమక్రమముగ నరకప్రాయ మగుచుండగ—

భ్రమరాం — అక్కా! నేను చెప్పదలచుకొనినమాట నీవు వినదలచుకొనలేదా?

విజయాంబ — భ్రమరా! చెప్పుము.

భ్రమరాం — అయిదారు దినములనుండి యేదో దీర్ఘవిచారమున నీవు మునిగియున్నట్లు తోచినది. అంత చే

రనంత వనవిహారమువలన నేమైన లాభముండునేమో యని ని న్నిచ్చటకు దీసికొనివచ్చితిని.

విజయాంబ — చెల్లీ! నాయందలి యనురాగముచే నీ వెన్ని చికిత్సలో చేయుచున్నను లాభ ముండునని నాకు తోచదు.

భ్రమరాం — (చిరునవ్వుతో) వెనుక ప్రబంధములలో విరహ వేదన కెట్టి లక్షణములు చెప్పిరో అట్టి లక్షణములు నీయం దగపడుచున్నవి. క్షమింపుము.

విజయాంబ — క్షమింపనక్కర లేదు. నీవు నిజమే పలికితివి. విరహవేదనమే నన్ను వేధించుకొని తినుచున్నది. మనోవ్యాధికి మందు లేదుకదా?

భ్రమరాం — అదేమిమాట? విరహమునకు ప్రియసమాగ మమే మందని పెద్దలు చెప్పుదురు.

విజయాంబ — ప్రియసమాగమ మసాధ్యమైనచో?

భ్రమరాం — అసాధ్యమా? ఆంధ్రక్షమామండలేశ్వరుని పుత్రిక కసాధ్యమా? అక్కా! నీయందలి భక్తిచే నీకయి నే నెంతటి యసాధ్యము నయినను సాధించి తీరెదను.

విజయాంబ — తీర నామనోరథము తెలిసినవెనుక నీకీ నిశ్చ యము నిలువదు సుమా?

భ్రమరాం — నీవు దేవకుమారుని వరించియుండవుకదా?

విజయాంబ — దేవకుమారులకుగూడ దుస్సాధ్యమగు పదార్థ మును నేను వరించితిని.

భ్రమరాం — (చిరునవ్వుతో) పదార్థ మనుచున్నావు. నపుంసకలింగమును వరించితివా ?

విజయాంబ — త్రిలింగాతీతమగు వస్తువును నేను వరించితిని.

భ్రమరాం — బ్రహ్మపదార్థమును వరించితివా ?

విజయాంబ — నేను వరించినవస్తువు బ్రహ్మపదార్థముకంటెను దుర్లభము.

భ్రమరాం — చిన్నప్పటినుండియు నీవు నాపయి వర్షించు ననురాగమునుబట్టి నన్ను వేపుకొని తినుటలో నీకింత పాండిత్యమున్నదని యెరుగనైతిని.

విజయాంబ — చెల్లీ! ఆంధ్రాభ్యుదయమును నేను త్రికరణ శుద్ధిగ వరించితిని. దానిని సాధించుటకు నీవేమయిన సాయము చేయగలవా ?

భ్రమరాం — ఇదేదో సామ్యము చెప్పిన తరువాయిగ నున్నది. ఆంధ్రాభ్యుదయ మనగ దాని కేమి కన్నా? కాలా?

విజయాంబ — అన్నియునున్నవి. చూడనేర్చినవారికన్నియు నున్నవి.

భ్రమరాం — నీమాటలు వినినకొలది నాకు నవ్వువచ్చుచున్నది.

విజయాంబ — ప్రకృతము జరుగబోవుచున్న ఈ ధరణికోట యుద్ధ మాపగలవా? అట్లయినచో నాంధ్రాభ్యుదయము తప్పక తానే నీకు గోచరించును.

సొంగి సొంగి రంబులుగా వ-యూర్మిమాలి
కల సుమహోన్నతశిఖర లీల గాంచించు
నాంధ్రులచరిత్ర నేడు నాయాత్మలోన
లీనమై దివ్యసంతోష మొసగుచుండె.

భ్రమరాం — సర్వసేనాధిపత్యము మీ జనకునిదే గదా! ఆయనతో నేల వాదింపలేక పోయితివి?

విజయాంబ — వాదింప నేమి? ఎన్నోవిధముల వాదించితిని. కాని ఆయన నేమిచేయుటకును స్వతంత్రుడు కాడు గదా! అందుచే ని న్నాశ్రయించుచున్నాను. నీమాటను మీనాయనగారు తప్పక ముద్దుచేయుదురు.

భ్రమరాం — అక్కా! నిజము చెప్పవలదా? నాయనగారితో మాటాడుటకు నాకు ధైర్యము చాలదు. అదిగాక ఆడువారికి మనకీ రాజకీయవ్యాపారములతో నేమిజోక్యము? —

విజయాంబ — నేను చేసిన చరిత్రబోధన మంతయు వృథయై పోయినదా? అదిగో అగనబడుచున్న భవనము పేరేమో యెరుగుదువా?

భ్రమరాం — అదినాయనగారు కొలువుండు భవనము కాదా?

విజయాంబ — అవును. దాని పేరేమో నీ వెరుగుదువా యని యడుగుచున్నాను.

భ్రమరాం — రుద్రమనగరు కాదా?

విజయాంబ — పురుష వేషమునుధరించి ఈ యాంధ్ర భూమండలమునంతను యేకచ్ఛత్రాధిపత్యముగ నేలిన రుద్రమ దేవి పేరున నది నిర్మితమాయినది.

భ్రమరాం — కానిమ్ము.

విజయాంబ — ఆమెకు సజాతీయులమని చెప్పుకొనుటకు నీకు లోలోన లజ్జవొడముట లేదా? రుద్రమదేవితో బోల్ప తగిన నీరులును పాలకులును మనవారిలో నెందరుందురో?

భ్రమరాం — సరి, ఎక్కడనో నూటికొకటి కోటికొకటి ఉండిన నేమాయె?

విజయాంబ — అట్లు త్రోసివేయకుము. "ఆర్యధర్మమునకు గ్లాని కలుగనున్నపుడు కుమారునిచే విజాతీయులను పారద్రోలించి స్వధర్మమునురక్షించితి"నని గర్వముతో జయస్తంభము నిలిపిన గౌతమి యిప్పటికిని ఆంధ్ర హృదయసింహాసనము నధిష్ఠించి రాజ్యము చేయుచున్నది కాదా?

భ్రమరాం — నీ వెన్ని చెప్పుము, నాయనగారితో వాదించుటకు నాకు ధైర్యముచాలదు. అదిగాక ప్రకృతిసిద్ధ

ముగ నాడుదానికిని మగవానికిని ఎంతో తారతమ్య
మును భగవంతుడే కల్పించినాడు. ఈ నాడు ప్రకృతికి
విరుద్ధముగ మనము వర్తించినచో దేశమున కుపద్రవ
కరమని నాయభిప్రాయము—

విజయాంబ — ఏదో యొకయంశముననయిన నీయభిప్రాయ
మనుసని యొకటి యున్నందులకు పరమసంతోషము.
నాకు సెలవిమ్ము.

భ్రమరాం — అక్కా యెక్కడికి బోయెదవు? అదిగో!
మోసాలలోనయి మ్రోగుచున్నది. పేరోలగమునకు
నిర్ణీతసమయము సమీపించినదిగదా? మనము దానికి
బోవలె ననుకొంటిమిగాదా?

విజయాంబ — లక్కబొమ్మలవలె గూరుచుండుటకు పేరోల
గమునకు బోనేల? ఇదిమాత్రము ప్రకృతివిరుద్ధము
గాదా? మనకు స్వాభావసిద్ధమయిన స్థానము అంతః
పురమే కాదా?

భ్రమరాం — (విజయాంబను గాగిలించుకొని) విజయము!
కోపము వచ్చినదా? అవకాశమునుబట్టి నీయాజ్ఞ నెర
వేర్చెదను లెమ్ము.—

విజయాంబ — (తనలో) ఇది నాకన్నీళ్లు తుడుచుట కను
చున్నమాట. (ప్ర) నా కించుక తలనొప్పిగ నున్నది.
నన్ను పోనిమ్ము—

భ్రమరాం — (తనలో) ఒకవిధముగ నీను సభకు రాక పోవుటయే మేలేమో!

[ ప్రవేశము గన్నమనీను ]

గన్నమనీ — మీ రింకను ఇక్కడనే యున్నారా? ఆవల పేరోలగము ప్రారంభ మగు చున్నదే?

భ్రమరాం — అక్కకు తలనొప్పిగ నున్నదట.- ఆమెను పోనిమ్ము. మన మిరువురమును నిండోలగమునకు బోవుదము.

గన్నమనీ — అయ్యో!—అక్కా! నీకు తలనొప్పివచ్చినదా?

విజయాంబ — (తనలో) నాతలనొప్పి యిప్పుడు వచ్చినది కాదు. దేశద్రోహమును కావించినాగు పాముయొక్క నెప్పుడు డగుపెట్టితినో అప్పటినుండియు నున్నదే! తల్లీ! ఆంధ్రమాత!

నీవు సమస్తభారత వినిర్మల దివ్యయశస్సరస్సులో
కేవల రాజహంసివయి క్రీడ యొనర్పగ జాలుభాగ్య విహీ
సేవకురాలికిన్ గరుణ సేయక పోయినదానిగా; నిత్య శో
ఖ్యావహమయ్యు మద్దార్ద్రిహృదయంబున నొండొకతావు చూపుమా!

(ప్ర) అవునన్నా! నాయొడలిలో బాగా స్థిగా ననారోగ్యముగ నున్నది.—పోయి రవంత విశ్రమించెదను.—

[ నిష్క్రమించును ]

(తెరలో వైతాళికులు)

చేసితి రక్తతర్పణము చేతులలావున జల్లిపల్లిలో
మీసము దువ్వురాజులకు మృత్యురమాలలనావిహారవి
న్యాసము జూపి చూపి కలవన్ నటియించెడి ఖడ్గపుత్రికా
హాసము దిక్కులన్ మెరయు నాంధ్రధరారమణీమనోహరా!

[అంతట తెరయెత్తగ వనపోతనాయని పేరోలగము. ప్రవేశము ఉచితాసనములపయి గూరుచుండి అనపోతనాయడు, మాదానీడు మంత్రులు, ఇతరోద్యోగులు. భ్రమరాంబ గన్నమనీడు కొలువు ప్రవేశించి యోగ్యాసనములపయి గూరుచుందురు.]

మాదానీ — సాధు! వైతాళికా! సాధు! చక్కగా నచించితివి.

కొలని ప్రతాపరుద్ర నృపకుంజరు డిచ్చిన విద్య పేర్మికిన్
జెలువము గూర్చు నీ సహజశేముషియాంధ్రుల కల్పవృక్షమై
వెలయ స్వధర్మ రక్తిమెయి వీరనికాయము నాంధ్రలక్ష్మికిన్
గొలు వొనరింపగా బనుచు క్రోల్పులి వీ వనపోతభూపతీ!

అ.పో.నా — కుమారా! మన మెంత దీక్షతో బనిచేసినను ఆంధ్రలక్ష్మికివి యనుకూల దినములుగ గానరావు. ఈ రెడ్లయొద్దనుండి వార్త వచ్చినదా?

మాదానీ — ఇంకను రాలేదు.

అ.పో.నా — రాదు. రానేరాదు.

మాదానీ — ఈ దినముతో వారు కోరినగడువు ముగియును గదా?

అ.పో.నా — ఇట్టివి ఈవర కెన్ని గడువులు ముగియలేదు? అబ్బ! అబ్బ! ఏమిగర్వము! ఏమి స్వాతిశయము! తమకంటె గోబ్రాహ్మణ హితైకతత్పరులు లేరనియు తమ కంటె దానకర్ణులు లేరనియు—

మాదానీ — అన్నగారూ! వారి ననవలసినపని యే మున్నది? పామునకు పాలు పోసి పెంచినట్లు వారికి రాజాశ్రయమిప్పించి మన మీ దేశమున కింత ముప్పు దెచ్చి పెట్టితిమి.

అ.పో.నా — అటు లనకుము. నేను మొదటినుండియు ప్రతి ఘటించుచునే యున్నాను. శిష్యవాత్సల్యముచే గొలని ప్రతాపరుద్రులే యిట్టి దేశోపద్రవమును దెచ్చి పెట్టినారు.

మాదానీ — గురునింద మన కెందులకు? వారు మాత్రము భవిష్యత్తును కలగాంచిరా?

అ.పో.నా — అటు లనకుము. పూవు పుట్టినప్పుడే వాసన తెలియును. ఈ దేశద్రోహచింత వారి కనాదిసిద్ధము గాని యీనాడు పుట్టుకొనివచ్చినది కాదు. పలుకు బడియందు, పరాక్రమమునందు, ప్రాభవమునందు, అన్నిటియందును మనకంటె నధికులమను గర్వము వారి కున్నది.

మాదానీ — పులినిచూచి నక్కవాత పెట్టుకొనిన ట్లున్నది. మనము శ్రీశైలమునకు సోపానములు నిర్మించిన, వారును శ్రీశైలమునకు సోపానములు నిర్మించుటా ? మనము బ్రాహ్మణుల కగ్రహారము లిచ్చిన వారును బ్రాహ్మణుల కగ్రహారము లిచ్చుటా ?

అ.పో.నా — వీని నన్నిటిని అటుండనిమ్ము. చక్రవర్తి యాజ్ఞను తిరస్కరించుటకు వారి కెన్ని వేలగుండె లుండవలెను? ఎవరికి వారే యనుతీరున నాయకు లుండగ నింకను నాంధ్రసామ్రాజ్యస్థాపనమా! ఇంతకు నాంధ్రజాతి యదృష్ట మిట్లున్నది.

[ ప్రవేశము ప్రతీహారి ]

ప్రతీహారి — దేవా! అద్దంకినుండి యన్నారెడ్డిగారు రాయ బారము తెచ్చినారట.

మాదానీ — సత్వరముగ బ్రవేశపెట్టుము.

ప్రతీహారి — చిత్తము.

(నిష్క్రమింపగ నన్నారెడ్డి యీక్రింది పద్యమును చదువుచు బ్రవేశించును)

అన్నారెడ్డి —

సీ. ప్రాచీనఋషులకు పాఠముల్ సెప్పగా
జాలిన వేదార్థసారమతులు
నిర్జీవశిలలచే నృత్యమాడింపంగ
నేర్పుగల్గిన కలానిపుణమతులు

పరవీరశిరముల బంతులాడించుచు
క్రీడింప నేర్చిన వాడిమగలు
సర్వసర్వంసహాచక్రపాలనమైన
నడిపింప నేర్చిన నాయకులును

గీ. కలరు పెక్కండ్రు తెనుగుభూములను నేడు;—
ఉండి ఫలమేమి? వారిలో నొక్కరయిన,
ననుదినంబు గృశించు నీ యార్తరావ
మాలకింపదలంప రో యాంధ్రమాత!

(అనపోతనాయనితో) నాయకాగ్రణీ! నమస్కారములు.

గన్నమనీ — (తనలో) మహారాజా యనినచో నాలుక పడి పోవును కాబోలును.

అ.పో.నా — అన్న చమూపతీ! నీ వా యాసనము నలంకరింపుము. మీ సీమలోని ప్రజలకు సేమమేకద?

మాదానీ — (తనలో) అన్నగారు తగినశాస్తి చేసినారు. ప్రజల సేమము నడుగుటచే ప్రభువుల నుపేక్షించుట కాదా?

అన్నారెడ్డి — ఏమి చెప్పను?

ఉ. లేవు; తెనుంగుబిడ్డలకు లేమి దొలంచెడి మంచిరోజులే.
రావు; సమీపజాతులకు రాజ్యమొసంగుచు స్వీయలబ్ధికై
పావనమాతృదేశపదపంకజముల్ నురుమాడుచుండు నా
శావిలచిత్తు లీయెడల నాంధ్రుల నాయకులై చెలంగగన్.

మాదానీ — (తనలో) కల్బరగి సుల్తానుతో జేసికొనిన సంధికై యీతడు మమ్మెత్తిపొడుచుచున్నాడు.

కానిమ్ము. దీనికి తగినసమాధానము నన్నగారే ఈయ వలయును.

ఆ.పో.నా. — ఇప్పటికయినను ఆంధ్రాభ్యుదయమునుగూర్చి మీ యన్నదమ్ముల కింతదీక్ష యుదయించినందులకు సంతసింపవలసినదే.

అన్నారెడ్డి — మా కెంతదీక్ష యున్న నేమిలాభము? ఇంకను తథాస్తుదేవతలకు దయపుట్టలేదుగదా!

గీ. ఎంతకాలమునుండియో స్వాంతమందు
కరడుగట్టిన యాంధ్రైక్యకాంక్ష దీర,
సీమ లొండొంటిఁ గౌగిట జేర్పబోవ
నడ్డ పడజూచు గ్రహముల కంజలిడుదు.

అ.పో.నా — నిజముగ నడ్డపడుచున్నవా రెవరో మీ యన్నదమ్ములే చెప్పవలయును.

అన్నారెడ్డి — మేము చెప్పెడు సమాధానము మీకు రుచింపదేమో యని మా సంకోచము.

అ.పో.నా — నోటికి కొంత హద్దుండవలయును. ధరణికోట మా కప్పగింపవలసినదిగ సార్వభౌమునియాజ్ఞ మీ కందినదా? లేదా?

అన్నారెడ్డి — ఆశకు గొంత మితి యుండవలెను. చక్రవర్తి పేరు చెప్పుకొని భూమండలమునంతను కబళింప జూచినచో నోరు పట్టవలదా?

అ.పో.నా — చెల్లుబడి యున్నది గనుకనే యాశించు చున్నాము.

అన్నారెడ్డి — అక్కడనే యున్నది కీలకము. నాయకులలో ఎవరికి వారే చెల్లుబడి గలవార మనుకొనుచున్నారు. అదే యీ పుట్టికమునుక కంతకును హేతుభూతము.

చ. వలదని మొఱ్ఱిక్కి వేడెదను; వైభవతృష్ణ నడంచి చూడుమా;
కలహము మాతృభూమికి వికాసము గూర్పదు; వెల్గవీడు నీ
తెలుగుధరిత్రికిన్ విపులతేజ మొనర్చిరి కాకతీయులన్
గొలిచెడువాడు—తద్యశము గోల్పడనేల వివేకవైభవా ?

అ.పో.నా — ఓయీ! పరోప దేశమున మీ యన్నదమ్ములు చూపుచున్న పాండిత్యములో సగమైనను స్వాచరణ మున జూపిన నెంత యందముగ నుండెడిది ?

అన్నారెడ్డి — వంశపారంపర్యముగ మా యధీనమునన్న ధరణికోటను మారుమాటాడక మీ కర్పించిన చో నక్కడకు మేము ప్రశంసార్హుల మగుదుము కాబో లును. మీ కోరిక—మా వరకు పోనేల—మీకైన సక్రమముగ దోచుచున్నదేమో—ఒక్కమా రాత్మ పరీక్ష చేసి చూచుకొనుడు.

గన్నమనీ — నాయనగారు రుపేక్షించినకొలదియు నీ పెద్ది తెగనీలుగుచున్నాడు.

మాధానీ — కుమారా! నీ వ్యాగకాంతుము—

అన్నారెడ్డి — నాయకాగ్రణీ! నామాటలు పెడచెవిని బెట్టకుము. ఈ ధరణికోట పేరుచెప్పుకొని ఇంతవరకు నడచిన స్వజనక్షయమునకు ధనవ్యయమునకు మేర లేదుకదా! మనలో మన మిత్రులు కలహించుకొనుచుండగ నన్యజాతులకు లోకువగుటలో నాశ్చర్యమేమున్నది?

ఉ. పుట్టితి మాంధ్రభూమిపయి పుణ్యములెన్నడొ చేసిచేసి; చే
పట్టితి మార్గ ధర్మముల; భారతభూమి సముద్ధరింపగా
గట్టిన కాసెకోకలకు గాకతిరాజ్యము ముద్ర వెట్టగా
నెట్టితి మిన్నినాళులును; నీతిదలంపు, విభేద మేటికిన్?

అ.పో.నా —శుష్క ప్రియములును, శూన్య హస్తములును ప్రయోజనకారులు కానేరవు. ధరణికోటను మాకర్పించి మరి మాటాడవలయును—

అన్నారెడ్డి — దేశక్షేమమును యోజించి మేము ప్రార్థించిన కొలదిని మీరు బిరుసెక్కుచున్నారు. ధరణికోట నర్పించి మాటాడవలయునుగా?

అ.పో.నా — ఎన్నోశతాబ్దములుగ నాంధ్రరాజవంశములు తమకీర్తిధనమును నిక్షేపించుకొనుచు వచ్చిన యమూల్యరత్నపేటిక ఈ ధరణికోట. అట్టి విజ్ఞాన భాండారము మా పాలనమున నుండుటకేగాని మీ పాలనమున నుండుటకు తగదు.

అన్నారెడ్డి — ఒక్క దేశమున నొక్క జాతిలో నుదయించి ఒక్కసామ్రాజ్యమును సేవించి యొక్క ధర్మము నవలంబించుచున్న మనము అన్నదమ్ములవలె నుండ వలసి యుండగా విజాతీయుడగు కల్బుర్గిసుల్తానుపయి చూపునభిమానమయిన మాపయి చూపకుంటిరే?

అ.పో.నా — అతపోతనాయని యాజ్ఞ సుగ్రీవాజ్ఞ. అది చెల్లి తీరవలసినదే.

అన్నారెడ్డి — తీర నాపత్సమయమున మీరు నమ్మికొనిన తురుష్కులే మిమ్ము ద్రోహము చేయుదురు సుమా!

అ.పో.నా — నా చెవులకు తాళముపడినది. ఆతాళము తీయుటకు ధరణికోట యొక్క యే సాధనము. అంత వరకు మీ మనవులను నేను వినదలచుకొనలేదు.

అన్నారెడ్డి — నే చేయుహితబోధను మనవులుగా గ్రహించుట మీ నిరహంభావత్వమునకు నిస్సందేహమయిన తార్కాణము.

అ.పో.నా — ఓయీ! నీవుగావున ఇంతవరకు మాటాడ నిచ్చితిని.

అన్నారెడ్డి — నీవుగావున నే ఇంతవరకు నుపేక్షించితిని.

మాదాసీ — ఆఁ! ఏమి నీ కండకావరము?

అన్నా రెడ్డి — కండకావర మెవరిదో విస్పష్టమగుట లేదా? చక్రవర్తిని త్రోసిరాజనుటా? ఆపయి తోడినాయకుల నవమానించుటా? అటుతరువాత ధరణికోట నాక్రమింపజూచుటా? ఎంత కండకావరము గాకున్న నంతవరకు సాహసింపగలము?

ఏల నిమీలితాక్షివయి యేడ్చెదవమ్మ తెనుంగుమాతరో!
"క్రోలుచు పాలు రొమ్ము పడగ్రుద్దె" నటన్న జనోక్తి నేడు నీ
పాల నిజంబొనర్పగ భవత్సుతు లెల్లరు నుద్యమింపగా
నేల వృథా ప్రయాసముగ నేడ్చెదవమ్మ సుధాపయస్వినీ!

(నిష్క్రమించును)

గన్నమనీ — నాయనగారూ! ఈ ప్రేలరి నిట్లు పోనిచ్చెదరేమి!

మాదానీ — నాయనా! గూతను శిక్షింపరాదుగదా?

అ.పో.నా — మాధవా! చూచితివా? ఎంతమాట యనినాడో! కండకండలుగ సీతని దేహమును చీల్చి కాకుల కెగుర వైచినగాని నా "కండకావరము" శాంతింపదు సుమా?

మాదానీ — ఈతనిని జీల్చిన ప్రయోజనమేమి?

అ.పో.నా — మరియెవరిని చీల్పవలెనందువు?

మాదానీ — ఈతని కీమాటలు నేర్పి పంపినవారిని చీల్పవలెను.

అ.పో.నా — పోలయ వేమారెడ్డినా?

మాదానీ — తండ్రినొక్కని తలదరిగినచో ఇంకను కుమార
రత్నము జీవించియుండునుగదా! కుమారుని వధించి
నచో అది తండ్రికిగూడ చిత్రవధ యగునుగాదా ?

అ.పో.నా — అటులయినచో వధించుట కంటెను జీవ
గ్రాహత్వ ముత్తమపక్షముగాదా ?

మాదానీ — అట్లయినచో నో సభాసదులారా!

ఓలగమిచ్చు నగ్రజునిరోయుల్లము పుల్లగిలంగ నాడె నే
ప్రేలరిరెడ్డి దౌత్య మను పేరిట నాతని కగ్రజన్ముడౌ
పోలయవేమనాయకుని పుత్రశిరోమణి గట్టి తెచ్చి మీ
మ్రోలను నిల్పనేని మరిముట్టను ఖడ్గము విశ్వసింపుడీ!
విజయదుందుభి మ్రోగించుచుగాని ఈ యాస్థానమున
మరల సడుగు పెట్టను.

(అని ఖడ్గహస్తుడయి కొలువు వెల్వడును. కొలువు వెల్వడుటకు
సూచకముగ వెనుకటి తెరదించవలెను. అతడు పరిక్రమించు
చుండగ నాతని కెదురుగ ప్రవేశము పోతరాజు.)

పోతరాజు — దేవా! మనవిజయము మాయమైనది. మన
విజయము మాయమైనది.

మాదానీ — (తనలో) ఏమి యీదురుపశ్రుతి! (ప్రకా)
మంత్రిపుంగవా! మీమాటలు నాకర్థమగుటలేదు.
విజయమేమి ? మాయమగుట యేమి ?

పోతరాజు — విజయాంబ యెక్కడికేగినదో తెలియవచ్చుట
లేదు. ఎంత నిగ్రహము చూపవలె ననుకొన్నను
మిమ్ములను చూడగనే నాదుఃఖ మాగినదికాదు.

మాదానీ — విజయాంబ మాయమైనదా? విజయాంబ మాయమైనదా? (అని చదికిలబడి) హా! ఇంకేమున్నది? నాపాలిటి భాగ్యదేవత మాయమైనదా? అమాత్యపుంగవా! మీరు జాగ్రదవస్థలో నేమాటాడుచున్నారా?

పోతరాజు — అంతఃపురమంతయు రోదనములో నిండిపోయినది. భటుల నన్నిదిక్కులకును బంపితిని. నాకు మతిపోయినట్లుండి ఇటు వచ్చితిని.

మాదానీ — నాకు ప్రాణమే పోవుచున్నది.

పోతరాజు — మీ కామె యనిన పంచప్రాణములును. నే నెరుగనా? ఈ వార్త మీకెంత జాగరూకతతో చెప్పవలెననుకొంటినో అత యకస్మాత్తుగను జెప్పితిని. నాకు నిజముగ మతిభ్రమించినది.

మాదానీ — అమ్మా! నీసౌందర్యమును, నీసౌశీల్యమును, నీపాండిత్యమును ఏ గోదావరి పాలుచేసితివో కదా!

పోతరాజు — మీరుకూడ నట్లు వాపోవుట ధర్మమా?

మాదానీ — చనిపోవునపు డామెతండ్రి నాచేత చేతిలో చేయివేయించుకొనెను. హా! ఇంకేమున్నది? నాకు గురుద్రోహపాతకము సిద్ధించినది.

పోతరాజు — ఇంతకును వెదకబోయిన భటులు వెనుకకు రానేలేదు కదా! ఇంతలో మీరు తొందరపడనేల?

మాదానీ — ఆమె స్వభావము మీకుఁ దెలియక యను కొనుచున్నారు. మహాసాహసురాలు.

పోతరాజు — ఆమెకును మీకును ఈనడుమ నేదయిన వివాదము నడచినదా ?

మాదానీ — ఆహా! అదేగదా ఇంత పుట్టిమునుకకును కారణము ?

పోతరాజు — వివాద మేవిషయమునుగూర్చి ?

మాదానీ — ధరణికోటమీదికి దండయాత్ర ధర్మముకాదని యామె, అగునని నేను.

పోతరాజు — సరి ఇక తెలిసినది.

మాదానీ — అయ్యయ్యో! ఎంతపని చేసినది ? ఎంతపని చేసినది ? అమ్మా! చనవుచే నంతతీవ్రముగ మాటాడు చుంటి వనుకొంటినిగాని ఇంతపని చేయుదువని యెరుగ నైతిని.

పోతరాజు — ఆహా! ఆమె ముఖారవిందము నాకన్నుల గట్టిన ట్లగపడుచున్నది.

మాదానీ — అమాత్యశేఖరా! అది దేవతావిగ్రహము కాని మానవవిగ్రహము కాదు.

పోతరాజు — ఎంతదుర్దశలో నున్నవానికయినను ఆ ముఖ మును వీక్షించినచో స్వర్గసోపానము లధిష్ఠించుచున్న ట్లుండును.

మాదానీ — ఆమె వ్రాసిన చిత్తరువుల నెన్నడైన మీరు తిలకించితిరా?

పోతరాజు — ఆ నడుమ "స్వయంప్రభస్వర్గారోహణము"ను రచించి నాకు చూపినది. అద్భుతముగ నున్నది. ఆ కవిత్వము మాత్రము? ఏమి పేశలమైన వాక్కు!

మాదానీ — అన్నియు నున్నవి. అంచునకు తొందరలేదు. అంతచే టభిమానము లేకున్న బ్రతికిపోయి యుందుము. అమాత్యశేఖరా! ఆమె మాయింట మరల నడుగు పెట్టు నదృష్ట మబ్బునందురా?

పోతరాజు — అధైర్యపడిన నేమిలాభము? నాశక్తివంచనములేక ప్రయత్నించెదను. ఆమెనుమరల మీసన్నిధికి జేర్పగల ననుధైర్యము నాకున్నది. అంతవరకు ననుగ్రహింపవలయును.

(అని మాదానీనికి చేయూత నీయగ నిరువురు నిష్క్రమింతురు.)

---

# ఆంధ్రతేజము

## మూడవ యంకము

---

### మొదటి రంగము

[ రంగము: ధరణికోటలో నొక పేదరాశి పెద్దమ్మ యిల్లు.
ప్రవేశము: పెద్దమ్మ, పురుషవేషమున విజయాంబ ]

విజయాంబ — అవ్వా! అగత్యము లేనిదే యబద్ధ మాడితివే? నేను మీపెత్తండ్రికుమారుడనని యెందులకు జెప్పితివి?

పెద్దమ్మ — నాయనా! నీకుఁ దెలియదు ఆ వచ్చినవా రెవ్వరో యెరుగుదువా?

విజయాంబ — ఎరుగను. ఎవరు వారు?

పెద్దమ్మ — ప్రచ్ఛన్న వేషముననున్న మంత్రిశేఖరు డని నా యనుమానము.

విజయాంబ — మహామాత్యుడు రామాప్రెగ్గడ ఈతడేనా? ఈతనికీర్తి చిరకాలమునుండి వినుచున్నాను. అద్భుత ప్రతిభాశాలియటగాదా?

పెద్దమ్మ — ప్రతిభాశాలియో గాని —

విజయాంబ — కాని యని యాగవలసి నేల?

పెద్దమ్మ — తననీడ చూచుకొని తాను భయపడునంతటి యనుమానగ్రస్తుడని చెప్పుకొందురు.

విజయాంబ — మిక్కుటమైన రాజభక్తి బహుశః అట్టియనుమానమునకు హేతువు గావచ్చును. ఇప్పుడీ ప్రచ్ఛన్న సంచరణమునలన ప్రయోజన మేమి ?

పెద్దమ్మ — నీవు చెప్పనే చెప్పితివిగదా ! రాజకార్యమనిన ఈతనికి నిద్రాహారము లక్కరలేదు. ఇవి యుద్ధదినములు గదా, ఎవరైన శత్రుసక్షమువారు మారువేషమున నగరమున బ్రవేశించిరేమో కనుగొనుటకు.

విజయాంబ — ఆలాగుననా ? నాయాలోచన మంతవరకు పోలేదు. పాపము ! నానిమిత్తము నీవబద్ధమాడవలసి వచ్చినదే ?

పెద్దమ్మ — వ్రతము చెడినను ఫలముదక్కినట్లు తోచదు. నామాట నాతడు విశ్వసించినట్లు కనబడదు. ఇంకొక్కముహూర్తమైనను నీ విచ్చట నాలసింపవలదు. ఏదోవిధముగ బయటపడవలెను.

విజయాంబ — ఇప్పు డంత భయకారణ మే మున్నది ?

పెద్దమ్మ — అట్లనకుము. ఈతడు మరల రావచ్చును.

విజయాంబ — రానిమ్ము. వచ్చి ఏమి చేయును ?

పెద్దమ్మ — అబ్బబ్బ! నీధోరణి నీదే కాని ఒకరు చెప్పిన మాట వినవు. నిన్ను కారాగృహమున బంధించినను బంధింప వచ్చును — చాల చిక్కు లున్నవి నీకు తెలియదు.

విజయాంబ — నాజన్మమున చిక్కులు ఈనాడు క్రొత్తగ వచ్చిపడినవి కావు. చిక్కులతో బుట్టి చిక్కులతో బెరుగుచున్నాను.

పెద్దమ్మ — (విజయాంబ గడ్డము పట్టుకొని) నామాట రవంత విను నాయనా! నిన్ను చూచిగ మానాయన జ్ఞప్తికి వచ్చుచున్నాడు. ఇట్టి సుకుమార దేహము చెర సాలలో నుండగ నేను చూడలేను.

విజయాంబ — ఇంకొక పట్టణమున ప్రాసాదాగ్రమున వసించు టకంటె ఈ పట్టణమున కారాగృహమున నుండుట యైనను సౌఖ్యప్రదమే.

పెద్దమ్మ — అయ్యో వెర్రితండ్రీ!

విజయాంబ — వెర్రి యనుము, పిచ్చియనుము. ఈ యూరిలో నడుగుపెట్టినది మొదలుకొని నాకు గోలోకమున సంచ రించుచున్నట్లున్నది. ఈ యూరనున్న రాళ్లు రప్పలు చెట్లు పుట్టలుకూడ ఆంధ్రుల ప్రాచీనవైభవమును గూర్చిమహోపన్యాసము లిచ్చుచున్నవి.

పెద్దమ్మ — ఈ యూరిలో పుట్టి, యీ యూరిలో పెరుగు చున్నాను. అరువదవపది దాటి డెబ్బదవపది వచ్చినది. ఇంతవరకు నాతో నొక్క రాయిగాని ఒక్క రప్పగాని మాటాడలేదే! నీకడ నేమి మాహాత్మ్యమున్నదో!

విజయాంబ — నీవు శ్రీశైల మెప్పుడైనను పోయితివా?

పెద్దమ్మ — ఏదీ! మానాయన నన్ను శ్రీశైలయాత్రకు తీసికొనిపోయెదననుచుండగనే మాయ తురకలు వచ్చి నాయనను పొట్టను బెట్టుకున్నారు? (అని కనుల నీరొత్తుకొనును)

విజయాంబ — పాపము! ఏకపుత్రమరణముకంటె కడుపు శోకమున కవధి యేమున్నది? కాని ఒక్కందులకు నీవు సంతోషింపవలెను. ఆంధ్రసామ్రాజ్యసంరక్షణార్థ మయి నీ కుమారుడు వీరశయనము నందినాడు. చక్ర వర్తియుప్పు దిని పెరిగినందుల కాతని ఋణము తీర్చు కొన్నాడు.

పెద్దమ్మ — అలాగునని నే సరిపెట్టుకొనుచున్నాను. తండ్రీ! ఎన్ని చెప్పినను కడుపుతీపిగదా! నాయనా! ఆలస్య మగుచున్నది. త్వరపడుము.

విజయాంబ — అవ్వా! నీ యింటిలో నున్నది మూడుపూట లేమైనను మూడు జన్మములనుండి నీతో బంధుత్వ మేర్పడి సల్లుగ మీయిల్లు వదలుటకు బుద్ధిపుట్టుట లేదు.

పెద్దమ్మ — నాయనా! ఈ మూడుపూట లయినను నీవు సరిగా భుజించిన దేదీ? మొన్న నుపవాసమే గదా. ఇక నిన్నను ఈ దినమునన్నైనను భోజనము సరిగా నున్నదో లేదో! పూర్వోత్తరపు వంటలేగాని ఇప్పటి పడుచువారు వండగలిగిన వంటకము లెవ్వియు నేను వండలేను. 'పలా' వని, 'కూర్మా' యని. 'కైమా' యని యేవోరకరకముల పిండివంటలటగాదా!

విజయాంబ — అవ్వా! ఆ కూళ్లన్నిటికంటెను నీచేతి ప్రసాద మెంతో శుచిగ లేదా? నిజము చెప్పిన నమ్మవు గాని మాఅమ్మ స్వర్గమునుండి దిగివచ్చి వండిపెట్టు చున్నట్లున్నది అందుచేతనే నిన్ను వదలలేకుండ నున్నాను.

పెద్దమ్మ — ఇదిగో! ఎవ్వరినైనను చక్కని చుక్కను చూచి పెండ్లి చేసికొనుము. వండినది వండకుండ దిన మున కొక పిండివంటచొప్పున వండిపెట్టగలదు.

విజయాంబ — అవ్వా! నీ మాటలు పిండివంటకంటెను రుచిగ నున్నవి.

పెద్దమ్మ — నాయనా! ఇక నాలస్యము చేయకుము. రేపుదయము రాజమహేంద్రవరము నుండి వచ్చిన పనసకాయ కొట్టించి వండవలె ననుకొంటిని. నీవు తినకుండగనే పోవలసి వచ్చుచున్నదిగదా!

విజయాంబ — అవ్వా! ఈ రూకలు నీవుతీసికో.

పెద్దమ్మ — సరి! సరి! ఎంతమాటాడితివి?

విజయాంబ — తక్కువ యిచ్చితినా?

పెద్దమ్మ — నీ వొకటి మా నాయన యొకటి కాదుగదా! నీ దగ్గర నేదియు తీసికొనదలచుకొనలేదు. నాకు మనసులో నొకటి, పైకొకటి కాదు నాయనా!

విజయాంబ — పెద్దదానవు గదా! ఇంటికి వచ్చినవారి కందరకు నీలాగున నన్నదానము చేసినచో నిక నెగ్గితివే!

పెద్దమ్మ — వేమునిరాజ్యములో క్షామము లేదు నాయనా! కర్పూరభోగములు గాదిలో మూలుగుచున్నవి. తినువారు లేక నేను చేవులాడుచున్నాను.

విజయాంబ — అది గాదు అవ్వా!—

పెద్దమ్మ — ఇక నీవు మారు మాటాడినచో నన్నుచంపుకొని తినినట్లే. ఇదిగో ఈ ముంత మామిడిపప్పును కంచుకములో నుంచుకొనుము.

విజయాంబ — అవ్వా! చలిపందిరివలె నున్న ఈవేముని రాజ్యమునుండి నన్ను సాగనంపుచున్నావు గదా. ఇతరసీమలు చూచి వచ్చిన పిమ్మట నాకీకొండవీటిసీమ నందనవనమువలెనున్నది. ఇచ్చట ముక్కఱకు ముత్య లేని యాఁడుది—పాగాకు పచ్చలులేని మగవాడు కాన

రారుకదా! ఏమి యీదేశ సౌభాగ్యము! ఇప్పుడే యిట్లున్నచో కాకతీయుల కాలములో నెట్లుండెనోగదా!

పెద్దమ్మ — తరువాత వర్ణింతువుగాని లే. నాకు మాత్రము నిన్ను విడువవలె నని యున్న దనుకొంటివా? నా దురదృష్టము! నీ దురదృష్టము! ఏమి చేయను? కొండ వీటి సీమకు రాచకొండసీమకు యుద్ధము వచ్చిపడినది.

విజయాంబ — సరే కానిమ్ము. బ్రతికియున్నచో పునర్దర్శనము. (పరిక్రమించి) ఎక్కడికి పోవలెనో ఏమి చేయవలెనో నాకే తెలియకుండ నున్నది. కొండంత యాశతో నీ కొండవీటి సీమలో నడుగుపెట్టిన నాకు తుదకిట్టిగతి సంభవించినదికదా!

చెలువపుదీవులై నెగడు సీమల కెందును నొండొకంటితో
కలయిక లేని యీ తెనుగుగడ్డను బుట్టిన దోషవహ్ని నా
తలపయి నిల్పి వ్రేల్చెదవు దారుణమే కద! దాసురాలిపై
చలువలు గ్రుమ్మరింపు మిక చంద్రకళాధర! మల్లికార్జునా!

[ నిష్క్రమించును ]

## రెండవ రంగము

[ ప్రవేశము : కృష్ణాతీరమున పాదచారియయి బలిష్ఠులగు నలుపురు యోధులతో పోరాడుచు అనపోతానాగడ్డి ]

ప్రథముడు — పోడు, ఈ దెబ్బతోసరి, అయ్యకు వగర్పారంభ మయినది.

ద్వితీయుడు — ఏమి పగర్వు. ఇప్పటి కార్యసరను బలిపుచ్చు కొనినాడు. మనము బుద్ధిపూర్వకముగ మహామారితో యుద్ధము దెచ్చిపెట్టుకొంటిమి. ఈతనిని బ్రదికియుండగ బట్టుకొనుట బ్రహ్మాంతరమా ?

తృతీయుడు — ఛీ! ఛండాలుడా! తల్లికడుపు చెడబుట్టి సిరికి మాట లాడుచున్నావు!

తురీయుడు — అబ్బ! అబ్బ! ఎంత దెబ్బరా - జబ్బనరికి నాడు. హా రెడ్డికులదీపకా! నిన్ను దొంగపోటున హత్యగావింప వచ్చినందులకు తగినశాస్తి జరిగినది.

ప్రథముడు — ఛీ మూర్ఖుడా! గట్టిగానరవబోక! రహస్యము భంగమగునని యెఱుగవా?

తురీయుడు — తేలుగుట్టి చచ్చినంత బాధ పడుచున్నాను. నీ కేమి? నే నింక బ్రదుకను. ఇదేదో ఒంటిపూస తేలు కావలెను. రెడ్డివీరాగ్రణీ! నన్ను క్షమింపుము

ప్రథముడు — అరే! వీ డెక్కడ దాపురించినాడురా! ఛీ, పిశాచమా!

[ అని తురీయుని తల నరుకును ]

అనపోత — (తనలో) వారిలోవారికి పోరాట మారంభమగుటచే నింతవరకు ప్రాణము నిలుపుకొనుచు వచ్చుచున్నాను, గాని లేకున్న నీవగకే నాపని సరికావలసి

నది. (ప్రకా)—ఓరీ దేశద్రోహులారా! ఈ దెబ్బతో మీపని సరి.

ప్రథముడు — అబ్బో! ఈ సొరకాయకోతల కేమి లే.

ద్వితీయుడు — అదిగో! దూరమున నేదో కాగడా కాబోలును. మినుకుమినుకు మనుచున్నది.

తృతీయుడు — కాగడా కాదు; కొరవిదయ్యము.

ప్రథముడు — కొరవిదయ్యము కాను, మిణుగురుబురుగులు.

ద్వితీయుడు — మిణుగురుబురుగులు కావు. మనిషి నడచిన చప్పుడు వినబడుట లేదా?

ప్రథముడు — నీ గుండెదడ నీ కట్లు వినబడుచున్నది. కొట్టు ఈ దెబ్బతో నయ్యపని సరి.

ద్వితీయుడు — అబ్బ! ఎంత దెబ్బ తీసినాడురా! యువరాజా! యువరాజా!

ప్రథముడు — అరవబోక! అరవబోక!

[తెరలో]

ఓరోరీ! దేశద్రోహులారా!

నిజతేజంబున నాంధ్రరాజ్యరమకున్ నీరాజనం బిచ్చుచున్
విజయారామవసంతుడై వెలుగు నీవీరాగ్రణిన్ జంపి భూ
ప్రజ కెల్లన్ దరిలేని యాపదల గూర్పన్ జాతురే దుర్జనుల్?
స్వజనద్రోహ మొ యాంధ్రదేశజుల కాచారంబె? చాలింపుడీ.

తృతీయుడు — (ప్రథమునితో) ఏమి గతి?

ప్రథముడు — ముందుగ ఈ కుంటికోడు నూడగొట్టవలెను గదా!

[అని క్రిందపడి పొరలుచున్న ద్వితీయుని నరకును. ఇంతలో కరదీపికనొక చేత గొని పురుషవేషమున విజయాంబ ప్రవేశించును.]

విజయాంబ — (తనలో) ఆకారము చూచినను వేషము చూచినను ఈతడు యువరాజుగ గన వచ్చుచున్నాడు. వీ రిరువురును ద్రోహులు.

[అని ఖడ్గము ఝళిపించుచు ప్రథమునిపైకి బోవును. అతడు పరుగెత్తును. విజయాంబ యాతని వెంటాడించును]

అనపోత — (ద్విగుణితోత్సాహముతో తృతీయునితో యుద్ధము చేయగ నాతడుపలాయితుడగును.) ఈ యపురూపబాంధవు డెవ్వడో నాకు ప్రాణదాన మొనర్చి నాడు. ప్రాణాధిక మగు పరువు నిలువబెట్టినాడు. కాని ఈ ద్రోహిని వెన్నంటి పట్టుకొనుటకు తగినశక్తి లేకుండ నున్నది.

[ఇంతలో విజయాంబ తిరిగి ప్రవేశించును]

విజయాంబ — ఇరువురిలో నొకనినైన బాడుదలను బట్టుకొన వలెనని చూచితిని. గాని సాధ్యము గాకపోయినది.

అనపోత — అయ్యయ్యో, మీ చేత నున్న కరదీపిక యేమైనది? మీ రెవ్వరో యించుక పరిశీలింపవలె నను కొంటినే,

విజయాంబ — రణకర్కశులగు ఇరువురి తలలు నరకుసంరింభమున కరదీపిక నిలుచునా? ఇంకనిచ్చట నేమాత్రము కాలవిలంబన మొనర్చినను ప్రమాదకరము కానచ్చును. మనము శీఘ్రముగ నగరమును చేరుకొనవలయును. అది ప్రప్రథమ కర్తవ్యము. ఈ ప్రాంతమంతయు మీకు కొట్టిన పిండియే కావున నించుక దారి తీయుడు.

[ఇరువురును కొన్ని యడుగులు పరిక్రమింతురు.]

విజయాంబ — మహాపురుషా! ఎంతప్రమాదము తప్పినది! ఎంతప్రమాదము తప్పినది!

అనపోత — ప్రమాదమున కేమున్నది? ఒక్కటీక హూంకారైనంతమాత్రమున సూర్యచంద్రులు గతులు తప్పరు. బ్రహ్మాండము తలక్రిందులు కాదు. ప్రళయము వచ్చిపడదు.

విజయాంబ — సామాన్యజీవుల విషయములో మీరు చెప్పినది వాస్తవమే కాని మీవంటి కారణ జన్ముల కాపద వాటిల్లినచో నది దేశమునకెల్ల నుపద్రవకరము కాదా?

అనపోత — అతిశయోక్తి నాదరించుట సజ్జనలక్షణము కాదే?

విజయాంబ — ఇం దతిశయోక్తి ఎంతమాత్రమును లేదని మీచేత నే ఒప్పింతును. ఇంచుక తాళుడు. సనాతన ధర్మ మనిన మీకు గిట్టదా ?

అనపోత — ఎంతమాట సెలవిచ్చితిరి. నాక ది ప్రాణాధికము గాదా ?

కలధౌత శిఖరంబు తలదన్ని యొసగయించు
మిన్నేటితరగను చిన్న పుచ్చి,
నందనోద్యానంబు క్రిందుమీ దనుపించు
కాశ్మీరవనమును కాల దన్ని,
వెలలేని గనులచే నలకాధిపతి నేలు
హిమవన్నగ శ్రేణి నీసడించి
కామధేనుగణంబు కన్నుసన్నలఁ గెల్చు
గంగిగోవులమంద భంగపరచి

విశ్వకల్యాణనిలయమై వెలయుచుండు
పరమమాహాత్మ్యసౌందర్య భాగ్య కలశి
యల సనాతనధర్మంబు తల ధరించి
పూజ సలుపని భారతపుత్రు డున్నె ?

విజయాంబ — ఎంత చక్కగ పచియించితిరి! మీరు చెప్పి నట్లుగ భూలోకస్వర్గమని ఖండాంతరములందు ఖ్యాతి గాంచిన భరతఖండమునందలి ప్రకృతిసంపద నంతను తులదూచినను యీ సనాతనధర్మముతో సాటిరాదు సుడీ.

అనపోతా — ప్రకృతిసంపద శాశ్వతమా? భూగర్భపరిణామమును బురస్కరించుకొని యీ దేశముననున్న నదులును, పర్వతములునుగూడ మాయమై భరతఖండ మంతయు నొక పెద్దఎడారియైన గావచ్చును. కాని ప్రాచీన ఋషులు ప్రపంచమునకనుగ్రహించిన సనాతనధర్మము మాత్రము విరుగని తరుగని పెన్నిధానము.

విజయాంబ — ఆర్యా! సత్యము వచియించితిరి. రెడ్డికులతిలకులు కవిపోషకు లని వినుటయే కాని కవు లని వినలేదు. మీ వర్ణనామాహాత్మ్యమున సనాతనధర్మము కన్నులకు గట్టినట్లున్నది. ఓ సనాతనధర్మదేవతా!

వేదపురాణ శాస్త్రమయ వేదిక నీదగు పుట్టినిల్లు; త్యా
గాది సమస్త సద్గుణ నికాయ సమగ్రులు తోడబుట్టువుల్;
భేదములేని సత్యమయాత్మను కొల్వొనరించు గద్దె; మా
త్రోదయ రాగరంజిత సముజ్జ్వలలోచన! నీకు మ్రొక్కెదన్.

ఆర్యా! అట్టి సనాతన ధర్మమునకు దారుణమైన గ్లాని సిద్ధింపనున్నదిగదా!

అనపోతా — అవును. నూతనముగ సత్యమును సందర్శించిన యుత్సాహముచే నుద్రేకించి కొన్ని జాతులు ఈ సనాతన ధర్మమును సమూలముగ నాశనము చేయవలెనని చూచుచున్నవి.

విజయాంబ — ఇంతవరకు మన యాంధ్రదేశములోనైన సనాతన ధర్మమునకు తలదాచుకొనుటకు తావు దొరికెడిది.

అనపోతా — ఇప్పుడా యవకాశముకుండ లేకుండ బోవు చున్నదిగదా! అంతఃకలహములచే నాంధ్రదేశము శమంతపంచకమువలెనున్నది.

విజయాంబ — అట్టిచో నీయంతఃకలహము లన్నిటిని అడచి వైచి యాంధ్రసామ్రాజ్యమును స్థాపించి సనాతనధర్మ మునకు కల్యాణమంటపము నిర్మింపగల మీవంటి వీర పురుషుల జీవితములు దేశమునకెంతయయావశ్యకములో వేరుగ వివరింపవలయునా ?

అనపోతా — ఆంధ్రులకు సామ్రాజ్యభాగ్యమా? అది కల లోనివార్త!

విజయాంబ — అటు లనకుడు. ఆంధ్రమాత యిప్పుడు నెలలు నిండిన చూలాలివలె నున్నది. నేడో రేపో సామ్రా జ్యోదయము కాక తప్పదు. ఈ చూలాలిని సంరక్షిం చుకొనవలసిన భారము మీవంటి శూరాగ్రేసరులపై నున్నదిగదా!

అనపోతా — (తనలో) ఈతని స్వరములో స్త్రీజనోచితమగు లాలిత్యము గనవచ్చుచున్నదే! చిత్రముగనే యున్నది (ప్రకాశముగ) మిత్రమా! నేటి ఈ యుపద్రవమును నేను దాటుటవలన దేశమున కెట్టి యుపకృతి జరగి నను జరగకున్నను మీవంటి యపుర్వాపవ్యక్తులమైత్రి

లభించుటవలన నా జీవితకుసుమమున కొక నూతన సౌరభము సిద్ధించినది.

విజయాంబ — ఆర్యా! నే ననవలసిన మాటను మీ రనుచున్నారు.

అనపోతా — కాదు, కాదు.

చీకటిఁ జీల్చి నాహృదయసీమను జొచ్చి గలంచి యాడు నీ
వ్యాకృతి, మానవాభ్యుదయబంధుర గానరసాన్వితంబు గాఁ
బైకొను గాత్రమాధురి, యపారవిలాసము జిల్కు పల్కులన్
లోకము లేలఁజాలు నతిలోకమహత్త్వము జాటి చెప్పెడిన్.

నాకీ దినమున నెన్నియోజన్మములుకలసిమెలసి తిరిగిన ప్రాణ మిత్రుని—వియోగానంతరము—మరలఁ గలసికొనిన ట్లున్నది గాని క్రొత్తవ్యక్తినిఁ గలసికొనినట్లు లేదు.

విజయాంబ — (తనలో) హృదయమా! అప్పుడే పొంగి పోకుము. ముందున్నది ముసుళ్ళపండుగ. (ప్రకాశముగ) ఆంధ్రజాతీయాభ్యుదయమున కాశాంకురములై రెడ్డిరాజ్య స్థాపకులను వంశాంకురము లయిన మీవంటి వారు మావంటి నిరుపేదల సహవాసము నింతగఁ గాని యాడవచ్చునా? అతిశయోక్తి నాదరించుట సజ్జనలక్షణము కాదే?

అనపోతా — (తనలో) ఆహా! ఏమి యీ గళమాధుర్యము.

చల్లని నారికేళఫలసారములై యలరారు నీరముల్
మల్లెలతో వసించి యసమానపరీమళయుక్తమాధురిన్

జల్లిసరీతి నీ స్వనము సౌఖ్యము గూర్చును పల్కుపల్కునన్
తెల్లము నేడు మాకు కులదేవత లిట్లు ప్రతిధ్వనించెడిన్.

(ప్రకాశముగ) మిత్రమా! నీ వాక్యరచనాపాటవము నన్నె
చటికో దీసికొని పోవుచున్నది.

ఆకాశవీధిలో నాటలాడుచు నున్న
తారకానన్నత్యంబు దచ్చి తెచ్చి,
రజతాద్రిశిఖరిపై రాజ్య మేలుచునుండు
నీహారధావళ్య మాహరించి,
ఊర్మి మాలికలలో నుయ్యాల లూగెడు
సెలయేటిచలువతో జెలిమి నెరపి
పుష్పసంతతులతో పొరలి పొంగి చరించు
నవవసంతంబులో బవరమాడి
ప్రౌఢగుణముల నొప్పు నీ వాక్యరచన
మస్మదీయ మనోవీథి నవతరించి
జ్ఞప్తి కొదవించు నెన్నియో జన్మములను
వర్ధనము నొందు సౌహార్ద వైభవంబు.

నీ స్వరూపమును సరిగా గ్రహించుటకు వీలు లేకుండ నీ కటికి
చీకటి యడ్డు వచ్చుచున్నది గదా!

విజయాం:— ఒక్క మీకు నాకు నననేల? ఆంధ్రజాతి కంత
కును ఇదే యడ్డువచ్చుచున్నదిగదా!

[ఇంతలో కొందరు భటులు కరదీపికలతో ప్రవేశించి యనపోతానీడ్డి
పాదములపై వ్రాలుదురు]

ప్రథముడు — మహాప్రభూ! ఇంత యాలస్యము చేసితి రేమి?
మిమ్ము జూచువరకును మా బొందిలో జీవుడు లేడు.

ద్వితీయుడు — అమాత్య శేఖరులు మీకయి పడుచున్న యారాటమునకు మేర లేదు.

తృతీయుడు — అందరిని అన్ని దిక్కులకు బంపినారు. మా యదృష్టవశమున మేము మిమ్ము కనుఁగొనఁగలిగితిమి.

అనపోతా — నా యదృష్టవశమునను ఈ యాపద్బాంధవుని సాహాయ్యముకతమునను నేను మిమ్ము మరల చూడ గల్గితిని. అయ్యయ్యో! నా నిమిత్తమయి మహామంత్రు లెంత శ్రమపడవలసి వచ్చినది! ఇదిగో పట్టణము సమీపించితిమి.

ప్రథముడు — తమ గుఱ్ఱ మేమయినది ?

అనపోతా — అన్నియు సావకాశముగ జెప్పెదను కాదా! అశ్వారూఢు లయి యా వచ్చు చున్నది యమాత్య శేఖరులు గారా ? (తనలో) భగవానుడా! ఏమిగతి ? ఈ యాపద్బాంధవునికూడ వా రంగీకరింప లేమో ?

విజయాంబ — (తనలో) తిరిగి తిరిగి మరల మొసలినోటిలో నికే వచ్చి పడితినే! ఏమి గతి? ఈతని నిప్పు డెట్ల యిన తప్పించుకొనవలెను — (ప్రకా) మహాపురుషా! నాకు సెలవు దయచేయుడు. మరల రేపుదయమున తమ దర్శనమునకు వచ్చెదను.

అనపోతా — ఇంతవరకు నా కాశపురాణములతో కాలక్షేప మయినది గాని యవ్యాజమిత్రులగు మీ పూర్వోత్తర ములనయిన దెలిసికొనఁజాలకపోయితిని,

విజయాంబ — క్షణభంగురము లగు తనువులనుగూర్చిన యెంత తెలిసికొన్న నేమి ప్రయోజనము ? మన మిప్పు డనశ్వర మగు నాత్మసంబంధ మేర్పచుకొంటిమి చాలదా ?

అనపోతా — వేదాంత వాక్యములతో విందుచేయుటకు నేను సమర్థుడనుగాను. మీరు నా యందు దయయుంచి కొన్ని దినములయిన నా యాతిథ్య మంగీకరింప వలయును.

విజయాంబ — అంతకంటెనా ? కాని ప్రకృత మీయూర మా పినతల్లికూతు రుండుటచే నామెకు ప్రాణము మీదకు వచ్చిన దనువార్త వచ్చి బయలు దేరితిని. అందుచే నా మనస్సు మనస్సులో లేదు — నన్ను పోనిండు.

అనపోతా — మీ పినతల్లికూతురా ? ఎవ రామె ?

విజయాంబ — అన్నియు రేపు సావకాశముగ నాయంతట నేనుగ వచ్చి మీకు మనవి చేసి కొందును— ప్రకృతము నాకు సెలవు దయచేయుడు.

అనపోతా — మీకంత యాత్రతగ నున్నపుడు నేను నిలుప రాదు. సదా కృతజ్ఞుడను.

[విజయాంబ నిష్క్రమించుచుండగ రామాప్రెగ్గడ ప్రవేశించును]

రామాప్రెగ్గ — (విజయాంబవంక నిదానించి చూచుచు) కుమారా! ఎవరీ క్రొత్తవ్యక్తి?

అనపోతా — (వినుపించుకొనక తదేకదృష్టితో విజయాంబ నీక్షించుచు ఆత్మగతమున) ఇంతవరకు చీకటి క్రమ్మియున్న దిగాని ఇప్పుడీ దీపసమీపమున నీ వ్యక్తిని సందర్శింపగనే విద్యుల్లత మెరసినట్లయినది. ఏమి యీ మనోవికారములు!

చకితము లైన భావములు సంచలనంబును నొంగు ఆత్మయున్
వికలము లైన చేష్టలను వెక్కసమై యెదు రీగు గాగమున్
క్రికమక పెట్టు కోరికలు త్రెంచుక పోవగ నీనిబంధమున్
సకియలపట్ల పూరుషుల సంభ్రమమున్ దలపించె నిత్తరిన్.

ఛీ! ఛీ! ఈ తుచ్ఛభావములను నిర్మూలింపవలెను.

రామాప్రెగ్గ — కుమారా! ఎవరీ క్రొత్తవ్యక్తి?

అనపోతా — (ఉలికిపడి) ఓహో అమాత్యశేఖరులా! నమస్కారములు. మీ మాట పెడచెవిని బెట్టినందులకు తగిన శాస్తి యయినది. అంతయు సావకాశముగ మనవి చేసెదను.

రామాప్రె — అటులే కానిమ్ము. కాని ఎవరీ క్రొత్తవ్యక్తి?

అనపోతా — ప్రకృతము నాకు ప్రాణదానము నొసర్చిన మహోపకారి యని మాత్రము చెప్పవలసియున్నది. అంతకంటె నేనును చెప్పజాలను.

రామాప్రె — అలాగునా? పాపము! నీవు చాల బడలి యున్నట్లు కనఁబడుచున్నది. అలయిక తీర్చుకొనిన వెనుక సావకాశముగ ముచ్చటించుకొందము.

అనపోతా — అమరేశ్వరుఁడు మాపాల నున్నాఁడు. లేకున్న యీ సరికి నే నేలోకమున నుండవలసినదో? గండు మనవి చేసెదను.

(అందరును నిష్క్రమింతురు)

## మూడవ రంగము

[ ప్రవేశము : ధరణికోటలో ననపోతారెడ్డి యాభ్యంతర మందిరము.

ప్రవేశము : సుఖాసీనులయి, రామాప్రెగ్గడ, అనపోతారెడ్డి. ]

రామాప్రె — ఈ క్రొత్తవ్యక్తిని గూర్చి నాకంతయు ననుమానముగనే యున్నది. తుదకు స్త్రీవ్యక్తియో పురుషవ్యక్తియో నిర్ణయించుటకూడ కష్టసాధ్యముగనున్నది.

అనపోతా — సాంద్ర మగు ననురాగమునకు తోడుసేసినదైన యనుమానము సంచరించుచున్నను. మా వంశముపై నున్న వాత్సల్యముచే మీ కన్ని యనుమానము లుదయించుచున్నవి.

రామాప్రె — నాయనుభవములో నే నెన్ని చూచినాను గాను? మొట్టమొదట మనకు విశ్వాస ముదయింప జేయుటకై యేదో స్వల్పమైన యుపకృతి చేసి మన

మెప్పును గడించి మన రహస్యము లన్నియు గనిపెట్టి శత్రుకార్యమును సాధించువారు లేరా?

అనపోతా — ఉండవచ్చును. కాని ఈతడు మనకు చేసిన యుపకృతి స్వల్పమయిన దందురా? అదిగాక ఈ వ్యక్తి ముఖము చూడగానే ఈతని కట్టి కౌటిల్యము అసాధ్య మని తోచుచున్నది. హృదయమునకు గవాక్షమువలె నున్న యాకన్నులలోనుండి అంతరంగము నందలి పవిత్రత ప్రత్యక్ష మగుచుండుట లేదా?

రామాప్రె — నే నెక్కుడు చనవు తీసుకొనుచున్నందులకు మన్నింపవలయును. ఆ చూపులలో నొకవిధమయిన బెదరున్నది. ఆనడకలో నొకవిధమయిన యొయ్యారమున్నది. ఈ వ్యక్తి అచ్చముగ స్త్రీలు నవ్వినట్లు నవ్వును. న న్నడిగినచో నాతనిలో నంతర్భూతమై యున్న స్త్రీత్వము మిమ్ము గాఢముగ నాకర్షించుచున్న దేమో యని నా సంశయము.

అనపోతా — (తనలో) కాదని నేను చెప్పజాలను. (ప్రకాశముగా) హరిహరీ! పురుషులను పురుషులు వలచుట ప్రకృతివిరుద్ధము కాదా! పోనిండు. వాదము నిమిత్తము మీరు చెప్పినదే సత్య మని యొప్పుకొన్నను ఆతనికి ఈ దినమున మనము చేయబోవుచున్న పట్టాభిషేక

మెద్దియును లేదుకదా. ఈదకింతవరకు నాతనిని కోటలో నడుగు పెట్టనీయనైనను లేదు.

రామా|ప్రె — అత డీ నగరమున నుండుటయే నాకు సమ్మతముగాదు.

అనపోతా — మనకు ప్రాణదాన మొనర్చిన పరమోపకారికి ప్రత్యుపకృతి నగరము వెడల నడిపించుటా?

రామా|ప్రె — రాజకీయములలో అనుమానమే ప్రమాణము?

అనపోతా — అనుమానమున కేదైన నాధారముండవలదా?

రామా|ప్రె — తీర నేదైన నపకృతి జరిగినచో చేయదగిన ప్రతీకార ముండకపోవచ్చును.

అనపోతా — ఈ తీరున ననుమానింప గడగినచో మన యొక్క మిత్రునయిన గణింపలేము. నన్ను మీరు మిమ్ములను నేను అనుమానించుకొనుచు కూర్చుండ వలసివచ్చును.

రామా|ప్రె — నా యనుమానము అంత హాస్యాస్పదముగ నున్న దందువా?

అనపోతా — ఈ మాత్రము సాహసమునకు నా కనుజ్ఞ నిండు. ఇంతమాత్రమున మించిపోవునది లేదు. ఆతడు మన నగరమున నడుగుపెట్టినది మొదలె నగరమున కొక నూతన వికాసము వచ్చినట్లుగ దోచుచున్నది.

రామాప్రె — నీ యిష్టప్రకారమే కానిమ్ము. కాని కన్ను జాగరూకతతో పహారాయిచ్చు మెలగవలయును సుమా! మీయింట నేదేని యొకటి భ్రష్టమైనచో అది నాతోనే నిలచును.

[ప్రవేశము—ద్వారపాలుడు]

ద్వారపాల — దేవా! మాంచానీని యొద్దనుండి యభ్యంతర సందేశహారి వచ్చి వాకిట నిలువబడియున్నాడు.

అనపోతా — మహామాత్యు లిచ్చటనే యున్నారు, రమ్మని చెప్పుము.

ద్వారపాల — మహాప్రసాదము.

[నిష్క్రమించును]

అనపోతా — ఇప్పుడిక నభ్యంతర సందేశ మెంతవాలకో!

రామాప్రె — ఇది యంతయు నొక నాటకము. నీకు తరువాత చెప్పెదనులెమ్ము.

[సందేశహారి ప్రవేశించును]

రామాప్రె — ఓయీ! నీ వా యాసనమున నాసీనుడవు కమ్ము.

సందేశ — చిత్తము. (అని యాసనమును చేతితో స్పృశించి నిలువబడియేయుండి) దేవా! శ్రీమన్మహామండలేశ్వర, రేచర్లగోత్రచింతామణి, జగనొబ్బగండ, రాయగండభేరుండ, రాయబందీవిమోచక, కాకతీయ

రాజ్యస్థాపనాచార్య సోమకులపరశురామాది జగ
త్ప్రసిద్ధ బిరుద నామధేయ ప్రశస్తి సహితులయిన శ్రీ
సింగమనాయని యనపోతనాయనింగారు సెలవిచ్చిన
యభ్యంతరసందేశమును సావధానచిత్తులరై యవధ
రింప ప్రార్థితులు.

రాజమంత్రి — ఓయీ! యువరాజులుంగా రవహితచిత్తులై
యున్నారు. నీ వెచ్చిన సందేశమును సాకల్యముగ
విశదీకరింపుము.

సందేశ — "ఆంధ్రక్షమామండలేశ్వరుల మగు మాయా
జ్ఞను దిరస్కరించి మాకోపాగ్ని కింధనములు గాకుడు.
సోమకులపరశురాముల మగు మాయాగ్రహమునకు
గురియైన జల్లిపల్లిలో రాజవంశముల కెట్టిగతి పట్టెనదో
మీ కెరుగనిది కాదు. శ్రీసింగమనాయనింగారివధలో
మీరుగూడ కొంత చేయి చేసుకొన్నట్లుగ నిటీవల మాకు
దెలియవచ్చుచున్నది. దాని కపరాధముగ మీరు
ధరణికోటను మాకర్పించినచో మీ నేరము క్షంతవ్య
మగును. ఎప్పటియట్లు సార్వభౌమునికి గట్టవలసినకప్ప
మును గట్టుట కంగీకరించినచో ఆనెగొందెనాయకుడగు
హరిహరరాయలను జయించి కప్పము గ్రహించు నధి
కారము మీ కొసంగబడును.''

దేవా! నా కెచ్చిన సందేశమును నేను వినిపించినాడను.

రామాత్రి — ఓయీ! ఇప్పుడు నీసందేశములో రెండు నూతనాంశములు గోచరించుచున్నవి. అందు మొదటిది–సింగమనాయని వధతో మాకుగూడ సంబంధము కల్పించుట. ఇది యభూతకల్పనము. ధరణికోటపై దండయాత్రకు సక్రమమయిన హేతువు లభింపక పోవుటచే లోకమును వంచించుటకు ఎత్తిన యెత్తు. ఇట్టి నీలాపనిందలు మోపుటవలన ప్రయోజన ముండదని నిష్కర్షగ చెప్పుము. ఇక రెండవయంశము – ఆనెగొందెను జయించి వారికి సమర్పించినచో కప్పము గైకొనునధికారము మా కనుగ్రహింతు రనుట. ఎంత యుదారస్వభావము! మా సేనలతో, మాశౌర్యముతో, మాధనవ్యయముతో నానెగొంటె సీమను జయించి తమకు స్వాధీనపర్చునధికారమును మాకు కృపచేయుచున్నారా? తమ రానెగొందెను జయించి మావశము చేసినచో మేమే తమ కట్టి యధికారమును ప్రసాదించెద మని చెప్పుము. ఇట్టి శుష్కసందేశముల యంతరార్థము మేము గ్రహింపక పోలేదు. నీవు సెలవు గైకొనవచ్చును.

సందేశ — (అనపోతారెడ్డి మొగమువంక జూచును.)

అనపోతా — మహామాత్యులవారు మామనస్సును పూర్ణముగ విప్పి చెప్పినారు. ఇక మేము వేరుగ చెప్పవలసిన దెద్దియును లేదు.

సందేశ — దేవా! పనివినియెదను.

[నిష్క్రమించును]

రామాప్రె — అభ్యంతర సందేశముపేరు చెప్పి మనప్రయత్నములను దెలిసికొనవలెనని వారి యాశ.

అనపోతా — అవును. తెలియుచునేయున్నది; కాని మన జాగ్రత్తలో మన మున్నాముగదా! దానికేమిగాని సోమకులపరశురాములట వింటిరా?

రామాప్రె — పది చప్పిడిపద్యము లల్లి "కవిరాజకంఠీరవు" డని బిరుదువహించుట యెంత అందముగ నుండునో పదిమంది భద్రాజులను వధించి సోమకులపరశురాముల మనుకొనుటయు అంతే యందముగ నుండును.

అనపోతా — రాయబందీవిమోచకులట!

రామాప్రె — ఆటంక మేమి? ఇతరు లొనర్చిన పరాక్రమకృత్యములను స్వకీయములుగ భావించుకొనుట కెంతటి సమబుద్ధి యుండవలయును?

అనపోతా — కాకతీయరాజ్యస్థాపనాచార్యులట.

రామాప్రె — ఇంతకంటె శార్దూలము హరిణరాజ్యస్థాపనాచార్యబిరుదము వహించిన నుచితముగ నుండును.

అనపోతా — ఇంకను కాకతిసామ్రాజ్యస్థాపన మెక్కడ? తనంత తానుగ వలచివచ్చిన భాగ్య దేవత మనమన స్పర్ధలకు నిలువజాలకుండ నున్నది.

భారతమాతృగర్భమున బండిన రత్నము లాంధ్రలక్ష్మికిన్
గౌరవ కంఠహారముగ కానుకదెచ్చిన భాగ్యదేవతా !
జారెదవేల సిగ్గుపడి ? చావగలేదు తెనుంగుభూమిలో
పౌరుషమింతవట్టునకు; భావిగతిం దలపోయ నేటికిన్ ?

రామారావు — నీవు చెప్పినట్లున్నంతలోఁ బౌరుషము నాశ్రయించుకొని ప్రయత్నింపవలసిన దేకాని విచారించి నచో లాభము లేదు.

అదిగో ! కాసెకోకలు బిగించుకొని యాంధ్రవీరులు యుద్ధసన్నద్ధులయి నిలువబడి యున్నారు.

అనపోతా — (ఆసనమునుండి లేచి దృష్టి సారించి) ఆంధ్రదేశ సేవాపరాయణులగు నో మహావీరులారా !

హస్తిబృంహితముతో సహేశ్వరుని పాద
ఘంటికానినదంబు గదలుకొనగ,
భేరీరవంబులో వీరగాథాపూర్ణ
ప్రాచీనభారతి ప్రతిరవింప,
జయపతాకములపై జాతీయవీరుల
నిర్నిద్రతేజంబు నృత్యమాడ,
కరవాలరుచులచే దరహాసకాంతితో
దులకించు జయలక్ష్మి పులకరింప
రక్తనాళంబు లుడుకెక్క రణవినోద
ఖేలనాసక్తి నిలపై క్రేళ్లువారగ
ధర్మసంస్థాపనార్థమై ధాన్యవాటి
నాంధ్రపుత్రులు రణసీమ కరుగుడయ్య.

[ నిష్క్రమింతురు. ]

# ఆంధ్రతేజము

## నాలుగవ యంకము

---

### మొదటి రంగము

[రంగము : ధరణికోటకు సమీపముననున్న విశాలమగు బయలు. యుద్ధభూమి.

ప్రవేశము : రెడ్డిపక్షమునకు జెందిన ఇరువురు కమ్మవీరులు.]

మొ.వీరుడు— నిన్న చూచిన ద్వంద్వయుద్ధమునకు సరివచ్చు ద్వంద్వయుద్ధమును ఇదివరలో చూడలేదు. ఇకముందు చూడబోము.

రెం.వీరుడు — నీవు సూక్ష్మముగ గనిపెట్టుచుంటివిగదా!— ఇరువురిలో నెవ్వరధికు డందువు?

మొ.వీరుడు— చెప్పజాలము. ఇరువురకు నిరువురే - నిన్నటి యుద్ధమును పురస్కరించుకొని చూడగ నామట్టునకు నాకు మాదాసీనిదే పై చేయి యనిపించినది.

రెం.వీరుడు — ఏమో. ఎన్ని చెప్పినను యువరా జెక్కడ? మాదాసీ జెక్కడ?

మొ.వీరుడు— యుద్ధకౌశల్యములో తారతమ్యమును నిరూపించునపుడు అభిమానమును పురస్కరించుకొని మాటాడరాదు —

రెం. వీరుడు — అంగీకరించితిని. ఒక్కటి చెప్పుము. యువరాజు బాణము తీయుట - ఎక్కుపెట్టుట - గుఱిచూచుట - విడుచుట నీ కేదైన గనుపించినదా? అన్నియు రెప్పపాటులో జరిగిపోయెడివి - ఆహా ఏమి లాఘవము ఏమి లక్ష్యశుద్ధి!

మొ. వీరుడు — కార్ముకవిద్యయందు యువరాజేషునుడు. కాదనలేనుగాని ఖడ్గయుద్ధముమాట యేమిచెప్పితివి? మాదానీడు ఖడ్గము త్రిప్పుచుండగ నెక్కడనయినను మనిషి కనిపించినాడా? దానికి నీవు సమాధానము చెప్పుము.

రెం. వీరుడు — ఖడ్గయుద్ధముకూడ నొక యుద్ధమేనా? కౌశలము చూడదలచి వచ్చినపుడు కార్ముకము నందే చూడదలెను.

మొ. వీరుడు — అదేమిమాట? దేనిఘనత దానిది. నిన్నటి యుద్ధము చూచినవెనుక నదివరలో మాదానీనిపయి నున్న యభిప్రాయము నాకు గొంత మారినది సుమా!

రెం. వీరుడు — మాదానీడుమాత్రము తక్కువవాడా? అఖండ శివభక్తుడు. అనవరత కవితాప్రియుడు. సంతత దాన నిరతుడు.

మొ. వీరుడు — ఎన్ని గుణములయినను అంగీకరింతువుగాని ఆతని యుద్ధకౌశలమును మాత్ర మంగీకరింపవు కాబోలును.

రెం.వీరుడు — అంగీకరింపనంటినా? ఎటు వచ్చినను ఇరువురను సరిపోల్చవలసివచ్చినపుడు మాత్రము —

మొ.వీరుడు—సరేకాని - ఈ రెడ్లకును వెలమలకును నింత తీవ్రమయిన కక్ష యెందులకో? ఇరువురును కవిపండిత పోషకులే కదా? ఇరువురును శ్రీశైలసోపాన నిర్మాతలే కదా? ఇరువురును అవక్రవిక్రమాదిత్యులే కదా?

రెం.వీరుడు — సమాధానము నీ మొదటి ప్రశ్నముసందే యున్నది. వీరు రెడ్లు - వారు వెలమలు నగుటయే ముఖ్యకారణము.

మొ.వీరుడు— హరిహరీ! కులకక్షలే కారణ మందువా?

రెం.వీరుడు — అధికారతృష్ణ అన్నిటికంటెను ముఖ్యకారణ మనుకొనుము - అదిగో. యువరాజును మంత్రిపుంగవుడును ఇటులే వచ్చుచున్నారు. మనమిక్కడ మసలినచో మర్యాద దక్కదు.

[ఒకవంకనుండి యీ యిరువురును నిష్క్రమింపగ ఇంకొకవంకనుండి యోధ వేషములతో అనపోతారెడ్డి రామాప్రెగ్గడయు ప్రవేశింతురు]

అనపోతా — ఓ కులద్వేష రాక్షసీ! నీ వెన్నడు కూలిపోదువో కదా! నీవు జీవించియున్నంతదనుక నీ దేశమున కభ్యుదయము రమ్మనిన నెక్కడినుండి వచ్చును?

రామాప్రె — కుమారా! (అర్ధోక్తిలో భటుడు ప్రవేశించును)

భటుడు — దేవా! అంతయు మించిపోయినది. అంతయు మించిపోయినది.

రామా[ప్రె — ఏమిరా, ఏమి మించిపోయినది ?

భటుడు — వెలమల ధాటికి తాళలేక మనవారు వెను దిరుగుచున్నారు.

అనపోతా — పద. దానికి ముందు నాదగ్గర నున్నది. మీ రోగము కుదిర్చెదను.

రామా[ప్రె — కుమారా! ఏమి చేసెదవు ?

అనపోతా — వెనుదిరుగుచున్న మన యోధులను మన యోధులచేతనే నరికించెదను. అప్పుడు అపజయము జయముగ మారును.

రామా[ప్రె — నీయుక్తికి మిగుల మెచ్చుకొంటిని. తక్షణమే యాపద్ధతి నవలంబింపుము.

అనపోతా — ఓ ఆంధ్రయోధుడా !

పగిలిపోయిన దానిమ్మపండురీతి
హృదయ మొప్పగ నాంధ్రుని వదనసీమ
దృష్టి నిడి యేడ్చుచున్నది తెనుగుతల్లి;
ఏల వెనుకంజవైతు వోయీ కుమార !

రామా[ప్రె —

తిన్నది గడ్డిరాజకులదీపకు డన్నము; కాలువెట్టి నీ
వున్నది పుణ్యభూమిపయి;— నూర్జితశౌర్యకలావిలాసినీ
సన్నుతపూర్వవైభవము జారగ వెన్కడు గేల పెట్టెదో
యన్న ! జయేందిరారమణియాదల నిల్వుము భూషణంబవై

అనపోతా —

చెందిరి — యోగమార్గమున జేరగరాని సువర్ణభూములన్
బొందిని మాతృపీఠమున బుష్పముగా నిడి పూర్వయోధు, లో
మందమతీ ! యధోగతికి మాటికి దూకెద వేల ? రక్తపుం
బిందువు లెల్ల చిందవలె వీరపథంబున నాంధ్రపుత్రకా!

[ తెరపడును ]

## రెండవ రంగము

[రంగము : ధరణికోట; కృష్ణానదీమధ్యమున నొకయేకాంతసైకతము, ప్రవేశము : ఒంటిగ యోధపురుష వేషముతో విజయాంబ]

విజయాంబ — నిరాశాదగ్ధమగుచున్న నాహృదయమునకు ఈ కృష్ణానదీపవనములు నూతన చైతన్యమును ప్రసాదించుచున్నవిగదా ! ఇక్కడనుండి నగరలక్ష్మి యెంత కన్నులపండువుగ గనవచ్చుచున్నదో !

ఇచ్చోట నాంధ్రుని హృదయకేదారంబు
  ముక్కారుపంటల మురిసిపోయె ;
ఇచ్చోట నాంధ్రుని హృదయవేదిక నిల్చి
  ప్రాచీనశౌర్యంబు ప్రజ్వలించె ;
ఇచ్చోట నాంధ్రుని హృదయసౌధంబుపై
  శిల్పకలాలక్ష్మి చిందులాడె ;
ఇచ్చోట నాంధ్రుని హృదయవిహారంబు
  బౌద్ధయోగికి తపస్సిద్ధి గూర్చె ;
వీణియల మించి మేదినీరేణువులును
ఆంధ్రతేజోవిరాజితమైన గీతి

నాలపించుచు నిచ్చోట కాలగర్భ
కీలితములైన గాథల మేలుకొలుపు.

ఆ దినము లిక మరల రావు కాబోలును.

పోయెనె యాంధ్రదేశమున పూర్వమునన్ వెలుగొందు శిల్పవి
ద్యాయత బౌద్ధధామములు, ధర్మనిరూఢసభాంగణంబులున్,
న్యాయకళాప్రవీణనరనాథమహేంద్రుల త్యాగభోగల
క్ష్మీయుతవైభవంబులును జీర్ణములై యమరేశ్వరప్రభూ ?

తల్లీ కృష్ణవేణీ !

ఏయే రాజ్యము లుల్లసిల్లినవో నీయీ తీరదేశంబునం
జేయే వీరులు విక్రమక్రమములై నీ యాంధ్రభూమీ ప్రజన్
శ్రేయస్స్ఫార విహారహారు లగుచున్ సేవించి పూజించిరో
ఆయా గాథల నాలపింపగదవమ్మా ముక్తకంఠంబునన్

[ప్రవేశము : తొందరగతో పేదరాశి పెద్దమ్మ]

పే. పెద్దమ్మ — అమ్మా! నీ విక్కడ నున్నావా, నీ కొరకు ఊరంతయు వెదకుచుంటిని. ఇట్టి స్థితిలో నాదమరచి నిన్నొంటరిగ విడిచిపెట్టిన నామూఢమతికి నన్ను నేను నిందించుకొనుచుంటిని. ఇంతలో నీ సంకేతస్థలము జ్ఞప్తికి వచ్చినది. నీవు నిరపాయవై గనవచ్చిన చో కాకతమ్మకు మేకపిల్లను బలి యిచ్చెదనని మ్రొక్కుకొంటిని

విజయాంబ — అవ్వా! అంత సులువుగ పోవు ప్రాణమా యిది? పుట్టీపుట్టకుండగానే తల్లిదండ్రులను బలిపుచ్చుకొన్నదిగదా! "పాపీ చిరాయు" వను నాణ్యోక్తి

యొకటి మనకు బలవత్తరమైన యాలంబనముగ గన వచ్చుచున్నదిగదా!

పే. పెద్దమ్మ — అమ్మా! అటు లనకుము. నీవు పాదము పెట్టుటచే నీనేల పవిత్రమయినది. నీవు లేకున్నచో పగటి పూట చుక్కలు పొడవవా? అనపోతారెడ్డిని వివాహ మాడి యాంధ్రసామ్రాజ్యమునకు లక్ష్మివై నీవు సింహాసనముపయి గూరుచుండగ కనులు చల్లగ చూచు భాగ్యమెన్నడో యనిమాత్ర మెదురుచూచుచున్నాను

విజయాంబ — అవ్వా! ఎంత వెర్రిదానవు! ఆతనిసన్నిధిని మరణింపగలిగినచో నాతనిని బరిణయమాడినంతటి ఫలము. అందులకుగూడ నాయమాత్యశేఖరుడు నాకవకాశము దొరకనీయకుండ నున్నాడే? కానిమ్ము. ఈ యుద్ధ మేదో తేలినవెనుక —

పే. పెద్దమ్మ — అబ్బబ్బ! అవాచ్యములను నోటికి రానీయ వలదని యెంత బ్రతిమాలినను మానవుగదా! నిక్షేపములాగున పెండ్లిపీటలపై గూర్చుండ వలసిన యీనాడున —

విజయాంబ — మొదటినుండియు నా చరిత్రమును దెలిసికొన్నచో నీ విట్లాసింపవు. ఎటు చూచినను విషాదాంతమగుసూచనలేగాని శుభాంతమగుసూచనలు నాజీవిత నాటకమునకు లేవు.

పే. పెద్దమ్మ — ఇరువది యేండ్లు నిండ లేవు. నాకంటె నెక్కువ యనుభవమున్నట్లు మాటాడుచున్నావు. ఇక నే నేమి చెప్పను ? పుట్టగనే తల్లిదండ్రులను గోలుపోయినవా రెంతమంది లేరు ? ఆయువులో, ఐశ్వర్యములో, చదువులో, సౌభాగ్యములో వారిలో పరిపూర్ణులై భవ మనుభవించిన వా రెందరు లేరు ?

విజయాంబ — అది కా దవ్వా — నేల విడిచి సాము చేసిన నందు వేమి ? నేను మాదాసిని కుమారైనని తెలిసిన వెనుక యువరాజు నన్ను క్రీగంటనైన జూచునా? ఈలనిమాట యెట్లున్నను ఈతనిని వేయికన్నులతో గనిపెట్టుచున్న యమాత్యశేఖరుడు తన ప్రాణములనైనను విడుచును గాని మా దాంపత్యమున కనుమతించునా ? ఆతని మాటకు వా రడుగు దాటరు గదా! ఎటువచ్చినను ఇన్నాళ్లీ మహాపురుషుని సాంగత్యము లభించుటే మనకు పూర్వజన్మ సుకృతఫలము. అంతతో మనము సంతోషింపవలెను. అనుభవము చాలని కవివలె ఈ సాంగత్యకావ్యమున కెట్లు స్వస్తి చెప్పవలెనో తెలియక కళవళపడుచున్నాను.

పే. పెద్దమ్మ — (తనలో) లేనిపోని యపోహలు కల్పించుకొనుట కీమెను చెప్పి మరియొకరిని చెప్పవలెను. ఇక నీమెతో నెంత వాదించినను లాభము లేదు. ఇంకొక ప్రసంగము తేవలెను. (ప్రకాశముగ) అమ్మా ! ఈ

దినము నీ ప్రియుని పరాక్రమమును నీవు వినలేదు కాబోలును. ఆతడు ప్రచండభాస్కరుడయి విజృంభించినాడట!

విజయాంబ — ప్రియుని పరాక్రమమునకు సంతసింపనా? తండ్రి పరాభవమునకు విచారింపనా? ఎవరు విజృంభించినను తుదకు జరుగుచున్న దాత్మహత్యయే గదా! ఆంధ్రు లొకరినొకరు వధించుకొనుచున్నారా, అది విని నేను సంతోషింపనా? ఎట్లు వచ్చినను అనారోగ్య నెపముననే నేనీ యన్యోన్యవధను కనులార చూడ కుండ తప్పించుకొంటిని.

పే. పెద్దమ్మ — అదుగో, నీ ప్రియు డిక్కడికే వచ్చుచున్నాడు. నేను పోయెదను. యుద్ధవిశేషము లాతనినోటనే విన గలవు.

[ నిష్క్రమించును ]

విజయాంబ — తల్లీ ధాన్యవాటికా?

ఏకాగ్రంబుగ నాంధ్రవీరులు యశోహేమాద్రి నిర్మించుచో
నేకంటన్ ప్రమదాశ్రుపూర్ణ వగుచున్ వీక్షించి తా కంట నే
శోకంబున్ వెల్గ్రక్కు బాష్పములతో క్షోభించి యన్యోన్యహిం
సాకాలుష్య కళంకితం బయిన యీ సౌభాగ్యమున్ జూచెదే

[ యుద్ధవేషముతో విచారగ్రస్తుడయి అనపోతారెడ్డి ప్రవేశించును ]

అనపోతా — మిత్రమా! యాంధ్రున కిది కష్టకాలము. ఈ దినమున నాకన్నులతో నేను పదివేలమంది

యాంధ్రవీరులపాటు చూచివచ్చితిని — ఇప్పటికి మూడు సారులు తరిమి కొట్టినను ఇసుళ్ళపుట్టవలె నెక్కడి నుండియో శత్రుపక్షమున సైనికులు వచ్చి పడుచునే యున్నారు. రావణుని శీర్షములవలె నరికిన తలలే మరల మొలచుచున్నవేమో తెలియదు.

విజయాంబ — అయిన రేపుదయము మరల యుద్ధమున్న దనినమాట —

అనపోతా — ఏమి యుద్ధమో నాకు తెలియకుండ నున్నది. ఈ దినమున అపజయమును తప్పించుకొని యీవల బడుసరికి తలప్రాణము తోకకు వచ్చినది! రెడ్డిరాజ్య భానుని కిది గ్రహణకాలము. నే నొక్కడనే చాలుదు నని మహారాజుతో బీరములు పలికి వచ్చితిని. కాని నా కీపరవీర సేనాసముద్రము దుస్తరమగుచున్నది — ఆహా! మాదానీడు విక్రమాదిత్యుడయి విజృంభించు చున్నాడు. ఏమి చేయుటకును దోచకుండనున్నది —

విజయాంబ — అతిమానుషపరాక్రములగు మీకును క్లిష్ట పరిస్థితులు వచ్చినవే?

అనపోతా — ఇంతవరకు పదిపర్యాయములైనను మే మొకరి నొకరు తలపడినాము. ఎప్పుడును అపజయ మను మాట యెరుగను. ఆతడు నాతో యుద్ధము చేయు

టకు జంకువాడుగాని నే నాతనితో యుద్ధముచేయుట కెన్నడును జంకి యెరుగను.

విజయాంబ — ఈ తడవకూడ మూడుదినములనుండి యాత నిని ముప్పుతిప్పల బెట్టుచున్నాడు గదా —

అనపోతా — ముప్పుతిప్పల బెట్టుచున్నా మనుము ; మాకు సంఖ్యాబలము చాలదు పది వేల బలముతో నూకా రెడ్డి కోరుకొండసీమకు బోయినాడు. ఇరువది వేలతో మల్లారెడ్డి మోటుపల్లి కేగినాడు. కొంతబలము అద్దం కిలో నుంచకతప్పదుగదా ! అదిగాక ప దేప దే యుద్ధ ములతో మావీరు లలసిపోయియున్నారు. ఇవన్నియు నీతో చెప్పుచున్నానని తెలిసినచో నమాత్యశేఖరుడు నన్ను బ్రదుకనీయడు.

విజయాంబ — నాథా . . . కాదు, కాదు. దండనాథాగ్రణీ ! ఆపత్సమయమున మీ కుపకరింపని నా జన్మ మెందు లకు — ఏమి చేయవచ్చునా యని యాలోచించు చున్నాను.

అనపోతా — శరీరములో స్వాస్థ్యములేని నిన్ను సంక్షోభింప జేసి మరింత బాధించుచున్నాను. కానిమ్ము, నాతో చెలిమిచేయుటయే నీ వొనర్చిన మహాపరాధము., అందుల కీదండన ననుభవింపక తప్పదు.

విజయాంబ — ఇట్టి ప్రశంసావాక్యములవలన ప్రయోజన మేమి ? ఏదైన నుపాయ మాలోచింపవలెను —

అనపోతా — నాకేయుపాయమును పాలుపోకుండ నున్నది. కోరినను ఇప్పు డద్దంకినుండి సాయము రానేరదు. దైనికముగ నేదయిన తటస్థించవలెనుగాని — నాపౌరుషమునలన ప్రయోజన మున్నట్లు తోచదు. నాబ్రతుకు ''దినదినగండము నూరేండ్లాయువు'' వనినట్లున్నది. ఏదో సాహసించి యొకవిషమసన్నివేశమున జిక్కుకొనుట, తుదకు దైవసాహాయ్యమున నావలబడుట — ఈ తీరున నడచుచున్నది —

విజయాంబ — నేను రేపుదయముననే యుద్ధమునకు వచ్చెదను.

అనపోతా — అయ్యయ్యో! వలదు. వలదు. నీ యారోగ్యము బొత్తిగ బాగులేదు. —

విజయాంబ — మహాశయా! మరేమియు భయములేదు. రెడ్డిరాజ్యభాస్కరు డస్తమించినచో ఆర్యధర్మములు పూర్ణముగ నడుగంటిపోవును. పొంగి పొంగి వచ్చుచున్న విజాతీయ మహాసముద్రమునకీ రాజ్యము చెలియలికట్టవలె నున్నది. దీనినైన సంరక్షించుకొన్న సరి, లేకున్నచో మనజన్మములు కాల్పనా? ఇది మీకార్యముగ మీరెన్నడును భావింపవలదు. యావద్భారత దేశమునకును ప్రాణదాయకమయిన యుద్యమము

మిది — ఇంకనలో నాహుతియగు భాగ్యమెంతవారికి పట్టును ?

అనపోతా — (తనలో) యుద్ధమునకు పోవుచున్నా ననిన మాటయేగాని నా హృదయ మీతని కడనే నిల్చిపోవు చున్నది. ఈతడుకూడ యుద్ధమునకు వచ్చినచో ద్విగుణితోత్సాహముతో విజృంభింప వచ్చును. (ప్రకా) నీవు కూడా మా తల్లికడుపున నేల జన్మింప వైతివి ?

విజయాంబ — (తనలో) అట్లయినచో నాజన్మ మంతయు నిష్ఫలమే యగునుగదా (ప్రకాశముగ) నా ...... నాయకాగ్రణీ! ఆమాట లన్నియు తరువాత నాడు కొనవచ్చును. మీరీ వేషమును విడిచి ఇంచుక విశ్రమింపుడు. పనలెల్లను శ్రమపడి బడలి యున్నారు. కర్తవ్యమును గూర్చి మీ రేమాత్రమును బెంగపెట్టు కొనవలదు.

అనపోతా — నీవు చెప్పినట్లు నేను బడలియున్నాను. రవంత విశ్రాంతి గైకొందును. నీవు కూడ ఈరాత్రి మనస్సు నలజడి పెట్టుకొనక పూర్ణమైన విశ్రాంతి ననుభ వింపుము. ఎంతసేపటికయిన నిన్ను పీడవలె నని యుండదు గాని ఇక నిక్కడ జాగు చేసినచో నమాత్యు శేఖరుని నలన మాటలు వచ్చును.

అనపోతా — }
విజయాంబ — } (చేతులు జోడించుకొని)

'పాహి' యటన్న మా హృదయభావ నిరూపణ చేసి చేసి — వి
ద్రోహులు దేశమాతపయి దూసినకత్తులు మొక్కవోవ నే
సాహస మాచరించెదరొ! సాయము గోరి వరంబు నిచ్చ్యెదన్
'దేహి' యటంచు వేడితిమి దేవతలార! యనుగ్రహింపుడీ!

[తెర పడును]

## మూడవ రంగము

[రంగము: మాదానీని శిబిరము.
ప్రవేశము: శయ్యపయి గూర్చుండి మాదానీడు]

మాదానీడు— తల్లీ! విజయాంబ! ఆజన్మాంతము నే నిట్లా క్రోశించుచుండవలసినదేనా? స్వప్నమందయిన నాకు నీ సందర్శనము లభింపదా?

[ప్రవేశము: పురుషవేషముతో - విజయాంబ]

మాదానీడు—ఓయీ, ఎవరు నీవు? సెలవు లేనిదే లోనికి బ్రవేశించినావు?

విజయాంబ — (కత్తిని దూయును.)

మాదానీడు— ఆ- ఏమి నీకండకావరము? (అని మోలనున్న కత్తిని దూయును.)

విజయాంబ — నాయనగారూ! ఆనూస మొందులకు? ఈ కత్తిని మీచేతి కందిచ్చుటకే యొగనుండి తీసితిని,

ఇదిగో! దీనితో నా శీర్షమును ఛేదింపుము (అని కత్తి నందీయబోవును.)

మాదానీడు— (తనచేతిలోనున్న కత్తిని జారవిడుచుచు) ఇది స్వప్నము కాదుగద? (అని కన్నులు తుడుచుకొని నిదానించి చూచి) హా కుమారీ! హా కుమారీ! నీవు మరణించితి వనుకొంటినే? నిజముగ బ్రతికియుంటివా?

విజయాంబ — నిజమునకు బ్రదికిలేను. తండ్రీ! సందేహింతు రేల? జీవచ్ఛవమునైన నా తలద్రుంచి నన్ను స్వర్గమునకు బంపరా?

మాదానీడు— అమ్మా! అంతటి ఘోరకార్యము నాచేత గాదు. చేజేత పుత్రికావధము జేయునంతటి నృశంసుడను గాను నేను.

విజయాంబ — మాతృవధ ముందు పుత్రికావధ ఘోర కార్యమూ?

మాదానీడు— ఆ! వెలమవీరావతంసునివయి మాతృవధ మోపుచున్నావా? చూడు. జాగ్రత్త!

విజయాంబ — జాగ్రత్త యని బెదరించి మీరు నన్ను చేయ గలిగిన దేమి? నా కంఠమును ద్రుంచెదరు. అంతే కదా? ఇదిగో! నా ప్రాణములను దండగా గ్రుచ్చి పుష్పోపహారముగ మీ పాదముల సన్నిధిని సమర్పింప

నుంటిని. నేను కోరుకొనుచున్నది, మీరు సంకల్పించు నది ఒక్కటియే కాదా ?

మాదానీడు— తల్లీ ! మాదానీడు స్త్రీవధను సంకల్పించు నంతటి దుష్టచిత్తు డనుకొంటివా ?

విజయాంబ — స్త్రీవధమైనను మేలే! గోవధమైనను మేలే ! బ్రాహ్మణవధమైనను మేలే ! అనేక వేల గోవులను స్త్రీలకును బ్రాహ్మణులకును మాతృస్వరూపిణియైన ఒక దేవతను యిప్పుడు మీరు వధించుట కుద్యుక్తులై నారు.

మాదానీడు— అబ్బబ్బ! గోమరోమ పాపమును ఒక్కొక్క శూలముతో పొడిచినను నాకింత బాధ యుండదు. నీ మాట లేమియు నా కర్థముగాకుండ నున్నవి.

విజయాంబ — తండ్రీ! అదిగో! ఆంధ్రమాత ! అదే ఆమె శీర్షముపై నభయహస్త ముంచి యాశీర్వదించుచున్న శ్రీశైలమల్లిఖార్జునుడు. అదిగో ! ఆమెగుండెను చీల్చి వ్రక్కలు జేయుటకు ఖడ్గము నూరుచున్న మాదానీడు.

మాదానీడు— ఆ ! ఆ ! ఎంతఘోరముగ మాటాడు చున్నావు ?

విజయాంబ — నా మాటలకంటె మీ చేష్ట లెన్నియో వేల రెట్లు ఘోరతరముగ లేవా ?

మాదానీడు— ఇందు నా యొక్కని మీద నే నేర మెట్లు మోపుటకు వీలున్నదో తెలియకున్నది. ఇరుకక్షుల వారును సిద్ధపడిననేగాని యుద్ధము సంభవింపదుగదా ?

విజయాంబ — తండ్రీ! ఇతరుల జోలికి బోక తమ రాజ్యమును తాము గోబ్రాహ్మణహితముగ బాలించుకొనుచున్న వారు రెట్లు— వారిమీదికి నడిచి కూర్చుండి యుద్ధమునకు వచ్చినవాడవు నీవు. ఎన్నివిధముల బ్రతిమాలినను నీ వీ యుద్ధసంకల్పమునకు స్వస్తిచెప్పవైతివి. అందుచే నీ నిలయమున నిక వసింపరాదని ప్రచ్ఛన్న వేషమున దేశాంతరము చొచ్చితిని.

మాదానీడు— తల్లీ ! నీవు నా యింట నడుగు పెట్టుట జనకుని యింటిలో సీత పాదము పెట్టినట్లుగ భావించి యహో రాత్రము లానందించుచుండువాడను. నీవు నా యెడ నెట్టి యన్యాయ మొనర్చితివి ? నీవు కనబడకపోయిన తరువాత మెతుకు ముట్టినచో నొట్టు—

విజయాంబ — తండ్రీ ! నీకు నా యెడ నిజమయిన యనురాగమున్నదని నేను విశ్వసింపను. నిజమైన యనురాగమే యున్నచో ఏ ప్రయోజనమును సాధించుటకయి నేను నీ యిల్లు విడిచిపెట్టియుందునో నీ వూహించియుందువు. ఇప్పటికయిన నీ దురుద్యమమును విరమించుకొనక పోవుట చూడగ —

మాదాసీడు—— వెఱ్ఱిదానా! వెలమలకు ప్రాణములకంటెను పగ సాధించుట ప్రియతరము. అందుచేత నీవు కాదు గదా —

విజయాంబ —— అదిగో నాయనగారూ! అటు చూడుడు. కాలయవనికను చీల్చవలయును — ఖడ్గముతో గాదు—— అంతర్నేత్రములతో—అదుగో! ప్రాచీనాంధ్రసామ్రాజ్యలక్ష్మి! అటు గంగాతీరము మొదలుకొని యిటు కాంచీపురమువరకును గల నరపాలు రామెకు వింజామరలు వేయుచున్నారు. అటు అజంతా మొదలుకొని యిటు అమరావతివరకును గల శిల్పు లామెకు సింహాసనములు చెక్కుచున్నారు. అటు గోమక దేశము మొదలుకొని యిటు చీనాదేశమువరకును గల వర్తకు లామెకు కానుకల బంపుచున్నారు. ఈనాటి బహు నాయకత్వము ఈనాటి మనస్పర్థలు — ఈనాటి స్వార్థపరత్వము — ఆనాడు విజృంభించి యుండినచో దేశమంతటి యుచ్చదశ ననుభవింపగలదా?

మాదాసీడు—— దూరపుగొండలు నునుపు. ఆనాడుమాత్రము మంచితనము ముద్దగట్టిన దందువా? రామరాజ్యము వెన్నంటియే రావణరాజ్య మున్నది. దేశమునందలి ప్రజ లందరును పూర్ణముగ రాములగుట కాని పూర్ణముగ రావణు లగుట గాని ఎన్నడును తటస్థింపదు.

విజయాంబ — ఆమాత్రము స్వస్వరూపజ్ఞాన మున్నచో చాలును.

మాందానీడు — ఆ! ఆ! ఎంతపోటు పొడిచితివి?

విజయాంబ — నాయనగారూ! క్షమింపుడు. మీరు చెప్పి నట్లు అంతఃకలహము లేదో యొక రూపమున నెప్పు డును నున్న నేకాని వెనుకటి దినములకు ఈ దినము లకును ఒక్కయంశమున భేద మున్నదిచేరవలెను. దేశ మున కాపద తటస్థించినప్పుడయిన ప్రజలు తమ యంతఃకలహములను మరచిపోయి ఏకముఖముగ బని చేసియుందురు; లేకున్న నంతటి యఖండ వైభవ మాంధ్రదేశ మనుభవించియుండదు.

మాందానీడు — ప్రస్తుత రాజకీయ పరిస్థితులను దెలిసికొనక నీవు మాటలాడుచున్నప్పుడు నే నేమి చెప్పగలను?

విజయాంబ — అయ్యయ్యో! నే నీ నడుమ చేయుచున్న పని యేమనుకొంటిరి? దేశాటన మొనర్చి రాజకీయ పరి స్థితులను చక్కగ గమనించితిని. ఆటలో నిమగ్నుడై కూర్చుండినవానికి తోచని ఎత్తులు ఈవలనుండి చూచు చున్నవానికి తోచును. అంతఃకలహముల కిది యెంత మాత్రమును తగిన సమయముకాదు —

మాందానీడు — మేము శస్త్రజీవులము — ఇది మాకు స్వ ధర్మము.

విజయాంబ — స్వధర్మమున కెంతటి విపరీతార్థమును సెల విచ్చుచున్నారు? మాతృదేవత మంగళసూత్రమును శస్త్రముతో ఛేదించుట స్వధర్మమా? పచ్చగ పెంపొంది పందిరివలె నున్న దేశమునకు నిప్పు పెట్టుట స్వధర్మమా? జాతి కంతికిను కిరీటమువలెనున్న నాయకు లను వధింపజూచుట స్వధర్మమా? ఏమి మాటాడ రేమి?

మాదానీకు— కుమారీ! చిన్నతనమునుండియు ని న్నెరుగు దును. నీ వెన్నడును నా యెదుట నిట్టి యావేశముతో మాటాడియెరుగవు. ఈ దినమున నేదో యొక దేవత ని న్నావహించియుండవలెను. నీకు నేను ప్రత్యుత్తర మీయజాలకపోవుచున్నాను. న న్నిప్పు డేమి చేయ మందువు?

విజయాంబ — నాయనగారూ! భారత దేశభాగ్యమున కధి నేతలగు త్రింశత్కోటి దేవతలును ఈ మహూర్త మున మి మ్మభినందించి యాశీర్వదించుచున్నారు— ఏనాడు జయచంద్ర హాతకుడు స్థానేశ్వరమున దేశ ద్రోహగీతము నాలపింప నారంభించినాడో, నాటి నుండి నేటివరకు నాతని మానసికపుత్రు లని చెప్ప దగిన తరువాతి దేశద్రోహులుకుండ న దేగీత మందు న్గొని రాగముకాని తాళముకాని మార్చకుండ నాలా

పనము సాగించుచున్నారు. ఇప్పుడు రవంత విరామము సిద్ధించినట్లు గనవచ్చుచున్నది —

మాదాసీడు— నీ మాటలు వినినకొలది నా హృదయము కంపించుచున్నది.

విజయాంబ — మీ మనఃపరిణామము చూచినకొలది నా తనువు పులకరించుచున్నది. మొన్న మొన్న నేగదా రామదేవహంతకుడు రెండవజయచంద్రుడయి యాంధ్ర సామ్రాజ్యమును తనపొట్టను బెట్టుకొనినాడు!

మాదాసీడు— తల్లీ! నీ స్వనములో నేడు దేవతలు ప్రతిధ్వనించుచున్నారు—

విజయాంబ — తండ్రీ! మీ హృదయమున నేడు భగవంతుడు ప్రత్యక్షమగుచున్నాడు. ఇప్పటికి మూడు శతాబ్దములకు పూర్వము ప్రారంభించిన భారత దేశ పారతంత్ర్య నాటకమునకు నేటితో భరతవాక్యము చెప్పినట్లయినది—

మాదాసీడు— ఎట్లు?

విజయాంబ — ఎప్పుడు నాప్రార్థనకు మీరు సుముఖులయి యుద్ధమునకు విముఖులయి స్వజన రక్తపాతమునకు స్వస్తి చెప్పబోవుచున్నారో అప్పుడే దేశాభ్యుదయ మారంభమయినట్లు కాదా? ఇంతవరకు మన దేశీయులే గదా మన దేశమును గెల్చి పరరాజులకర్పించినది?

మాదానీడు— తల్లీ! కొందరు వ్యాఖ్యాతలవలె నామాటలకు నే నుద్దేశింపని విశేషార్థమును గల్పించు కొంటివి. దేనిని సంకల్పించుటకుగాని నాకు స్వాతంత్ర్య మెక్కడిది? అన్నగారి యాజ్ఞ ననుసరింపవలసినవాడ నేకదా!

విజయాంబ — తండ్రీ! అంతేనా? స్వయముగ ధర్మాధర్మ నిర్ణయ మొనర్చుటకు తగిన వివేకము మీకున్నను అనుసరించుటకు స్వాతంత్ర్యము లేదా?

మాదానీడు— ఇప్పుడు నీవు చెప్పనే చెప్పితివిగాదా? ఎవరికి వారే నాయకు లగుటవలన దేశమున కెంతి యనర్థదాయకమో. చిరకాలముక్రితమే నా జీవితమును మా యన్నగారి పాదముల కంకిత మొనర్చికొంటిని.

విజయాంబ — మీ సౌభ్రాత్రమునకు సంతసింపవలసిన దే. కాని దానిని మీరు దేశసేన కేల వినియోగింపరాదు? నిజపరిస్థితు లన్నియు తెలియబరచి యుక్తియుక్తముగ నిరూపించినచో మీయన్నగారుకూడ మీయభిప్రాయముతో నేకీభవింపవచ్చునుగదా! ఆయన కేల నేల వ్రాయకాదు?

మాదానీడు— ఏమని వ్రాయను? నాకీ యుద్ధభూమి చూడగనే ఒడలు కంపమెత్తుచున్నదని వ్రాయనా?

విజయాంబ — ఆహా! స్వాభావ్యత్వభవమానముమన్న ఏ పురుషునికైన నీ యుద్ధభూమి చూడగనే ఒడలు కంపమెత్త వలసిన దే.

మాదాసీడు— నీవు బౌద్ధ ధర్మమును పురస్కరించుకొని మాటాడుచున్నావు గాని —

విజయాంబ — ఆర్యధర్మము మాత్రము ధర్మ క్షేత్రమున యుద్ధ మొనర్చినచో వీరస్వర్గము లభించునని చెప్పినది కాని —

మాదాసీడు— అమ్మాయీ! నీ తోడ యుక్తికి బ్రతియుక్తి చెప్పుట కష్టము —

విజయాంబ — ఏ కష్టమును లేకుండనుండు మార్గమును నే నిదివరకే మనవి చేసికొంటిని గాదా? ఇదిగో! చేతులు జోడించుచున్నాను. నాతోబాటు ఈ ముహూర్తమున శాతవాహన చక్రవర్తుల యాత్మలు — ఇక్ష్వాకు రాజ పుంగవుల యాత్మలు — చాళుక్య చోళ సార్వభౌముల యాత్మలు చేతులు జోడించుకొని "మే మల్లారుముద్దుగ లాలించి పెంచుకొనుచు వచ్చిన యాంధ్రలక్ష్మిని హత్య చేయకుము" అని ప్రార్థించుచున్నవి. — —

మాదాసీడు— తల్లీ! ఈ యుదయమున నే ముహూర్తమున నీ ముఖారవిందమును సందర్శించితినో ఆ ముహూర్తమున నే నా చేతినుండి అప్రయత్నముగ ఖడ్గము జారి పోయినది.

విజయాంబ — జారిపోయిన ఖడ్గమును మరల తీయవలదు - తీసినచో నా శిరచ్ఛేదమునకే తీయవలెను. —

మాదానీడు — అబ్బబ్బ! అమంగళము ప్రతిహతమగును గాక!—

విజయాంబ — తండ్రీ! నాయొక్క వివాహము పేరు చెప్పగనే ఇంత కంటగించుకొనుచుండిన మీరు ఈ యుద్ధభూమిని హతులయిన వేనవేల వీరులభార్యలను సహోదరీలను, తల్లులను గూర్చి యాలోచించితిరా? వారు మాత్రము మీ బిడ్డలు కారా?

మాదానీడు — అబ్బబ్బ! నా హృదయమును సూదులతో పొడిచి తునుకలుగ ఖండింతువు?

[ ప్రవేశము ప్రతీహారి ]

ప్రతీహారి — దేవా! ఆంధ్రతటసామంతలేశ్వరుని గౌడు నుండి యాంతరంగిక లేఖ.

(అని యొకజాబును చేతికిచ్చును)

మాదానీడు — (చదువుకొని తనలో) ఎంతఘోరము! సుల్తాను మామీదికి దండయాత్రకు వచ్చుచున్నాడా? అన్నా రెడ్డి చెప్పినదంతయు జరిగినది. (ప్రకాశముగ) అమ్మా! నీ ప్రార్థనకు దేవతలు ప్రసన్నులైరి. ప్రస్తుతము యుద్ధ మాపవలసినదని యాజ్ఞ వచ్చినది —

విజయాంబ — నాయనగారూ! నా చదువు కొంతవఱకయిన చెల్లించితిరి. అది యదే పదివేలు. నమస్కారము — పోయివచ్చెదను.

మాదాసీషు—— అమ్మా! ఎక్కడికి పోయెదవు? అసలు ని న్నింతదనుక నెఱుగమఱచితిని. ప్రచ్ఛన్న వేషమున నున్న నీకు లోనికి ప్రవేశ మెట్లు దొరికినది?

విజయాంబ —— చిన్నతనమునుండియు మీయొద్దఁ బెరిగిన దానను. ఆమాత్రము మీసంకేతములనే సంపాదింప లేకపోదునా? నా నిమిత్తము ప్రతిహారిని బాధింతు రేమో——

మాదాసీషు—— బాధింపను పూనుకొనను గాని, — వచ్చిన దానవు మరల నెక్కడికో పోయెదనను చున్నావేమి?

విజయాంబ —— ఇంతవఱకు నా సంకల్పము పూర్ణముగ ఫలింప లేదుగదా?

మాదాసీషు—— నీ సంకల్ప మేమని?

విజయాంబ —— ఎన్నటికయిన నేను మీరును ఒక్క కంచము న గుడిచి ఒక్కమంచమున నిద్రపోవగ చూడ వలెనని ——

మాదాసీషు —— అది యసంభవము! అసంభవము!

విజయాంబ —— అది యసంభవమైనచో నేను మీ యింట మరల నడుగుపెట్టుట యంతకంటెను నసంభవము.

మంగళతూర్యఘోషముల మంజులనిస్వన మొప్ప మాగధీ
యాంగన లాంధ్రవీరులకు హారతు లెత్తినవేళ నెంతగా
పొంగితివో! యశఃకలశి బోరగిలంబడ నిప్పు డెంతగా
క్రుంగెదవో! జగజ్జనని! ఘూర్ణిలకమ్మ, మహాంధ్రరాష్ట్రమా!
[నిష్క్రమించును]

మాదానీడు— హా! నా జీవితప్రభ నిష్క్రమించుచున్నది. పరిస్థితు లెంత విషమించినవి? నిలుచున్నపాటున రావలసినదని యన్నగారి యాజ్ఞయా? అరచేతిలోని విజయ మైంద్రజాలికుని మంత్రప్రభావముచే నెగిరిపోయి నట్లుగ మాయమైనదా? పట్టుదల యొక్కటే పెను భూతమునలె పీడించుకొని తినుచున్నదా? విజయాంబ కట్టకడపట పలికిన వాక్యము మాత్రము నా చెవులలో గింగురుమని మారుమోగుచున్నది —

మంగళతూర్యఘోషముల మంజుల నిస్వన మొప్ప మాగధీ
యాంగన లాంధ్రవీరులకు హారతు లెత్తినవేళ నెంతగా
పొంగితివో! యశఃకలశి బోరగిలంబడ నిప్పు డెంతగా
క్రుంగెదవో! జగజ్జనని! ఘూర్ణిలకమ్మ, మహాంధ్రరాష్ట్రమా!
[తెర పడును]

---

# ఆంధ్రతేజము

## అయిదవయంకము

### మొదటి రంగము

[ధరణికోటలో ననపోతారెడ్డి యభ్యంతర మందిరములో నొకగది.
ప్రవేశము: భోజనానంతరము తాంబూలములు వైచుకొనుచు సుఖాసీనులయి
అనపోతారెడ్డి, పురుషవేషమున-విజయాంబ]

అనపోతా — ఎంత సాహసము! ఎంత సాహసము! ఇదివరకు మాదానీనితో మీ కేమయిన పరిచితియున్నదా?

విజయాంబ — పరిచయమున కెంత గావలయును? "నీవు ఆంధ్రపుత్రుడవు గావా? నీకు బుద్ధిలేదా?" అని చీవాట్లు పెట్టుట కెవరయినను చాలరా?

అనపోతా — అంతమాత్రము చేతనే యాతనిబుద్ధి మరలినదందురా?

విజయాంబ — నామాటపలననే యాతనిబుద్ధి పూర్ణముగ మరలినదని నిశ్చయించుటకు వీలులేదు. కాని చాల వరకు మెత్తబడినాడు. ఇంతలో "రోగియు పాలే కోరినాడు, వైద్యుడును పాలే చెప్పినా" డనినట్లుగ అన్నగారి యొద్దనుండి యుద్ధ మాపుచేయవలసినదని ఏదో శ్రీముఖము వచ్చినది. బహుశః బహామనీసుల్తాను

రాజగిరిపైకి దండయాత్రకు బయలుదేరి యుండెనని నాయనాహా —

అనపోతా — అసలు మీకు వారి శిబిరములోనికి ప్రవేశ మెట్లు చిక్కినది ?

విజయాంబ — ప్రాణములను తెగించినవానికి ప్రవేశము చిక్కుట కేమున్నది ? ప్రతీహారికి రెండు ప్రహరణము లిచ్చితిని.

అనపోతా — అయినచో నిమ్ము వారు మరల విడిచిపెట్టుట యెట్లు సంభవించెను ?

విజయాంబ — ఎన్ని చెప్పినను మూదానీనియొద్ద కొంత యౌదార్య మున్నది కాని లేకపోలేదు. దేశము దురవస్థ వర్ణింపగనే అతని మనస్సు కొంత కరగి, నాపయి కొంత మొగ్గర ముదయించినది—

అనపోతా — ఘాతుకవ్యాఘ్రములకు కరుణారసము. మూదానీని కౌదార్యమునా ? నేను నమ్మను. మీరు చెప్పినట్లుగ ఏదో దేవత నిమ్మావహించి మీచే నీకార్యము నిర్వహింపచేసినది. ఏమైననేమి గానిండు, మీరు నేడు మా రాజ్యమునకు చేసిన మహోపకృతి నేమి నెన్నటికి మరవజాలము.

విజయాంబ — మీ రట్లు సెలవీయదగదు. ఇది యంతయు నా స్వార్థము నాశించి నేను చేసికొనుచున్నది గాని యింకొకరి నెవ్వరిని ఉద్ధరించుటకు గాదు.

అనపోతా — అమాత్యశేఖరులు నేటి మీ సాహసమునకు చాల సంతసించిరి. మిమ్ము మంత్రివర్గములోఁ జేర్చుకొనెద మనుచున్నారు. రేపు మహారాజే నగరమునకు దయచేసి యిక్కడనే నిండుకొలువు విచ్చునని యిప్పుడే వర్తమానము వచ్చినది. కొలువులో మీ సేవను ప్రశంసించి మీకు మంత్రిపదవి నిప్పించెదరట.

విజయాంబ — మీ ప్రశంస వినగ నాలో నాకే సిగ్గువేయుచున్నది.

అనపోతా — ఆ...(అని ఆవులించుచు చిటుక వేయును)

విజయాంబ — మీకు నిద్దుర వచ్చుచున్నట్లున్నది. నేను సెలవు తీసికొందునా ?

అనపోతా — మీరుకూడ ఆ శయ్యపై రవంతసేపు విశ్రమింపరాదా? ఈ దినమున నేనుచేసినపని యేమియు లేకున్నను మనస్సులోపడిన యారాటమునకు కన్నులు బరువెక్కి మూతపడుచున్నవి.

విజయాంబ — నాకు పగటిపూట నిద్దుర యలవాటు లేదు.

[ అనపోతా గద్దె కూర్చుండియే నిద్రపోవును ]

విజయాంబ — ఈతనికి మాటలాడుచుండఁగనే నిద్రపట్టినదే! ఈతని సన్నిధిని ప్రాణములు వీడు నవకాశము చిరకాలమునకు దొరకినది. ఈ తరుణము మించినచో

మరల దొరకదు. పరమేశ్వరా! ముందుజన్మమున
నయిన నా కీతనిని పతిగ ననుగ్రహింపుము.

(అని యాత్మహత్యకై కత్తిదూయును.)

(తెరలో: రామాప్రెగ్గడ — ద్రోహీ! ఆగుము ఆగుము.
[అని చివాలున బ్రవేశించి విజయాంబ దక్షిణహస్తమును బట్టుకొనును.
అతని వెనుకనే కొందరు భటులు ప్రవేశింతురు.]

రామాప్రె — (బిగ్గరగ) ఎంత పాపాత్ముడవురా? ఎంత
దుర్మార్గుడవురా! మొదటినుండియు నే ననుమానించు
చునే యుంటిని.

అనపోతా — (కన్నులు నులిమికొనుచు) ఏమి యీ నిద్రా
భంగము (కన్నులు తెరచి చూచి) ఏమి యీ నృశ్యము!
(అని విస్మయము)

రామాప్రె — కుమారా! మేము నీకు నిద్రాభంగముచేయక
యుండినచో నీ గోముఖవ్యాఘ్రిమీసరికి ఎంత దారుణ
మొనర్చియుండునో యెరుగుదువా?

అనపోతా — సచివోత్తమా!—మీరు కంటికి రెప్పవలె
మమ్ము కాపాడుచుండగా మాకొక యాపద తటస్థిం
చునా? మీ రీతని యుద్యమము నెట్లు గనిపెట్టితిరి?

రామాప్రె — కుమారా! మొదటినుండియు నేను చెప్పు
చుండుటలేదా? ఈతని వాలకము నాకు చాల నను
మానాస్పదముగ నున్నది. ఈగ డ్డీ యువయుముష

మాదానీని శిబిర మెప్పుడు ప్రవేశించెనో అప్పటి నుండియు నాకు మరింత యనుమానముగ నున్నది. ఈతడు వారి యాంతరంగికుడే గాకున్నచో వారి యభ్యంతర శిబిరమున కీతని కంత సునాయాసముగ ప్రవేశము లభించునా ?

అనహోతా — ఈతడు మాదానీని యనుచరు డందురా ?

రామాప్రె — ఇంకను సందేహమా ? మాదానీ డంత యక స్మాత్తుగ 'ధర్మద్వార' పూరించుటకూడ నాకసహజము గానే కనవచ్చినది. ఈతడు రహస్యముగ నీ ప్రాణము లను దీసెద నని యాతనికి వాగ్దాన మిచ్చినమీాదట నాతడు సంతృప్తి వహించి వెనుకకు బోయియుండును.

అనహోతా — మీా యూహ ఒక్కయంశముతో నతుకకుండ నున్నది — ఆ రాత్రి నేను హతుడ నగుటకు సిద్ధ ముగ నున్న సమయమున నీత డెందులకు నన్ను రక్షింపవలెను ? "కాదలచిన పని గంధర్వులే చేయు చున్నా" రని యూరకుండవచ్చునే !

రామాప్రె — నీవొక్కడవే హతుడవైనచో ప్రయోజనము తక్కువగాదా ? నీ విశ్వాసము నార్జించుకొని తాను కూడ నీ యతిథియై కోటలో బ్రవేశించి రాజకీయ రహ స్యము లన్నియు గనిపెట్టవలెను. లేకున్న నీతడు కల గనినట్లు నిన్ను హత్యచేయు సమయమున కచ్చటి

కెందులకు రావలయును ? అప్పటి హాత్యాప్రయత్నము కూడ ఈతని పన్నాగమే యైయుండవలెను.

అనపోతా — ప్రపంచములో నెచ్చటను ఇంతటి నీచ నాటక మసంభవము.

రామాప్రె — నాయనా ! నన్ను క్షమింపుము. సిగ్గు చిన్నతనము.

అనపోతా — అమాత్యశేఖరా ! ఏదైన నిశ్చయమునకు వచ్చుటకు పూర్వము మనము యుక్తాయుక్తములను బాగుగా విచారింపవలసియుండును. కనుక సహజముగ శత్రువైనవానిని మిత్రుడనుకొనుటవలన వచ్చు నష్టము కంటె నిజముగ మిత్రుడయినవానిని శత్రువనుకొనుట వలన నష్ట మధికము.

రామాప్రె — ఉత్తమనీతిలో నీవు చెప్పిన సిద్ధాంతము సరియైనదే. కాని రాజనీతి యందుల కంగీకరింపదు. భారతము పరీక్షించినచో రాజులు ఎంతటి మిత్రులయినను నమ్మినట్లు నటించుచు నమ్మరాదని సూచించుచున్నది.

అనపోతా — ఈతని ముఖము చూచినచో ద్రోహబుద్ధుల కాతని హృదయములో తా వున్నట్లు కానరాదే ?

రామాప్రె — అయ్యయ్యో ! ఇప్పుడు నిన్నితడు వధించియుండినచో మా గతి ఏమి కావలసినది ? ఆంధ్రదేశ

చరిత్రమునకు మకుట మనదగిన మహావీరుడు అకారణ మరణముపాలయి దేశ మరాజకము గావలసిన దేనా ?

అనపోతా — సర్వేశ్వరుడు భక్తసంరక్షకుడు గదా! మన కాపద రానిచ్చునా ?

విజయాంబ — (తనలో) మహాపురుషా! ప్రేమించిన నిన్నే ప్రేమింపవలయును. నా జన్మ మీ ముహూర్తమున సార్థక మయినది.

అనపోతా — (విజయాంబవంక చూచి) మిత్రమా! నీ చర్యలు విపరీతముగ నున్నవే! నీ వేమి చెప్పెదవు ?

విజయాంబ — ఏమియు చెప్పను. ఏ శిక్ష విధించినను చిరు నవ్వుతో స్వీకరించుటకు సిద్ధముగనున్నాను. విధించు శిక్ష మరణమునకు తక్కువ కానీయకుడు.

అనపోతా — అమాత్యశేఖరా!—ఈతని చరిత్రలో నేదో యగాధవిశేష ముండితీరవలెను. మనము తొందరపడ రాదని నా యభిప్రాయము. ఈ సమయమునకూడ నింత స్థైర్యముతో జవాబుచెప్పుట ప్రాకృత పురుష లక్షణము గాదు —

రామాప్రె — యువరాజా! నీ వెన్ని చెప్పినను నీ మాట నేను వినదలచుకోలేదు. వినుట దేశక్షేమకరము కాదు — నీ తండ్రికి నిన్ను సురక్షితముగ నొప్పచెప్ప వలసిన బాధ్యత నా పై నున్నది. (భటులతో) ఈత

నిని తత్క్షణమే కాలుచేతులు బంధించి కారాగృహ
మున నుంపుడు. రేపు నిండోలగము కదా ? అప్పుడే
నేరము విచారణ జరుగును. —(అనపోతారెడ్డితో)
విచారణ గాకుండ మాత్ర మీతని కెట్టి శిక్షయు
విధింపను.

(భటులు బంధిత యగు విజయాంబతో నిష్క్రమింతురు
రామా పెగ్గడ నిష్క్రమించును)

అనపోతా — నెచ్చెలీ! పౌరాణ కావ్యమువలె నీ చరిత్రము
నా కనగాహనము కాకుండ నున్నదే ?
పాలని మ్రింగలేక విషపాన మటంచు త్యజింపలేక యా
లోలవిలోకన ప్రభల లోకములన్ మరపించు శక్తికిన్
గీలక మే యెరుంగక బ్రకీర్ణమనస్కృత స్నిగ్ధవేదన
జ్వాలల గ్రాగు నాకల పుష్పాఖ్యరసంబును గ్రోలు టెన్నడో!

రెండవ రంగము

[ధరణికోటలో కొలువుకూటము]

(తెరలో వైతాళికులు)

గేయము : మంజరి.

శ్రీశైలశిఖరమ్ము శీర్షభాగమ్ము ;
గోదావరీగంగ స్వాదుమానసము ;
నీల పెన్నెబువేణి నీకు కృష్ణాంబ ;
ధాన్యవాటిక నీదు ధర్మాసనంబు ;
ఆంధ్రరాజ్యస్థాపనాచార్యుడైన
వేమవసుకుండు నీ మనోహరుడు ;
దీపాలదిన్నెపై దీర్చు కూర్చున్న

తేనె జిల్కెడువాణి! తెనుగునారాణి!

నీకు మంగళమమ్మ! నిత్యకల్యాణి!

[అని తెరలో పాడుచుండగ తెర యెత్తవలెను. రంగస్థలమున సేనానాయకుడు సామంతరాజులు మొదలగువారు, ముఖ్యముగా కవి ఎర్రాప్రెగ్గడ, మంత్రి రామాప్రెగ్గడ, యువరాజు అనపోతారెడ్డి రాజాగమనమును నిరీక్షించుచు ఉచితాసనములపయి గూర్చుందురు. మాగధబృందము వచ్చి "సందడి దూరము సందడి దూరము" అని బిగ్గరగ నరచగనే అందరు లేచి నిలుచుందురు. తరువాత వంది బృందము ప్రవేశించి]

పల్లవాదిత్య, జయ విజయీభవ! సంగ్రామధనంజయ, జయ విజయీభవ! అపరిమిత భూదాన పరశురామ? జయ విజయీభవ! శ్రీపర్వతాహోబల నిర్మిత సోపాన, జయ విజయీభవ! బ్రహ్మకుండి సహ్యజా గౌతమీ జల క్రీడావినోద, జయ విజయీభవ!

[అని యరచుచుండగ పోలయ వేమారెడ్డి ప్రవేశించి సింహాసనమునకు నమస్కరించి సభకు నమస్కరించి నిలువబడియుండును]

ఎర్రాప్రెగ్గ —

(అక్షతలు చాల్చి పోలయ వేమారెడ్డిని సమీపించి)

విద్యాతపో వృద్ధ విప్రుల కగ్రహా
రము లిచ్చి పూజించు స్వామిభక్తి
పాడిపంటలు సదా వర్ధిల్ల ప్రజకెల్ల
రామరాజ్య మొసగ్చు నీమయుక్తి
హింసమా గుహా ధర్మ సౌందర్య రక్షణ
ప్రాభవా జీతమా ఖ్యాపబాలను

హేమాద్రిపరికీర్తితామితవ్రతదాన
నివహనిర్వహణ చిహ్నిత విభూతి
ఇష్టదేవతలై నీకుకష్టములను
దొలచి విజయంబు గూర్చి నిర్మలచరిత్ర
ధాన్యవాటిక నాచంద్రతారకముగ
నేలుకొనుము మాన్య యాంధ్రభూపాలమౌళి !

( అని యక్షతలు వేమారెడ్డిశిరముపై నుంచును. )

పో. వేమా — (తల వంచి) బ్రాహ్మణాశీర్వచనము పరిగృహీతము.

( అని ఎఱ్ఱాప్రెగ్గడకు నమస్కరించును. ఎఱ్ఱాప్రెగ్గడ తన యాసనమునకు బోయి కూర్చుండును)

మహామాత్య ! ఇప్పటికి మన సంగరము మనకు నిలబడినదా ?

రామాప్రె — మహారాజా ! ఇప్పటి దేశపరిస్థితులలో నిది కూడ యొక ఘన కార్యముక్రిందనే మనము సంతసింప వలెను.

పో. వేమా — ఇంతలో నీ దేశపరిస్థితులు బాగుపడునట్లు నాకు తోచదు. తల్లీ ! ఆంధ్రమాత !

విశ్వవిపంచికా విమలగానరసంబు
నీవాణి నొకమాఱు నిలచెనేమొ ;
నవఖండపాలనానందకందళముల
నీదండ మొకమారు నిండెనేమొ ;
పూర్వదిగ్వల్లరీ పుష్పనికుంజంబు
నీచెంత నొకకొంత పూచెనేమొ ;

పశ్చిమాశామణి శాల్యనర్తనకేళి
వీక్షితోల నొకనీల నెగడెనేమొ ;
వెనుకటి దినంబు లెల్లను విస్మరించి
బ్రదుకుచున్నాము జీవచ్ఛవంబులట్లు ;
కొంటి యౌన్నత్య మాత్మకు దోచినపుడు
గుండె వ్రక్కలు గాకుండ నుండగలమె ?

ఎఱ్ఱాప్రెగ్గ —

ఉత్తమోజ్జ్వలముల కురూపితలూరుచు
స్వాగతం బొసగు నుత్సాహశక్తి
త్రికరణశుద్ధిగా నకలంకబుజమార్గ
గామిగ్గై యేగు నిష్కపటవృత్తి
తనవారి పెరవారి తారతమ్యముతోడ
వీక్షింపజాలని విపులదృష్టి
అడుగుపెట్టినచోట మడమ ద్రిప్పక నిల్చి
యాహుతి యైపోవు సాహసంబు
ఎన్ని సుగుణంబు లున్నను నేమి ఫలము ?
పోదు మనయాంధ్రజాతికి భేదబుద్ధి ;
రాదు స్వజనానురాగంబు ; లేదు దీక్ష ;
కాదు ముమ్మాటికినిగూడ కార్యసిద్ధి.

పో. వేమా — సరే కానిండు. విధి కెదురీద నెవరితరము ? సచివాగ్రణీ ! — యుద్ధమున మనపక్షమున ప్రాణము లర్పించిన మహాశూరుల కుటుంబములకు తగినవృత్తు లేర్పరుపబడినవా ?

రామాప్రె — ఆ...యివిగో ! (అని కొన్ని శాసనముల నిచ్చును.)

పో. వేమా — (భటుడు చూసగ చూచి తల యూచిన పిమ్మట వానిపై నొక యుద్యోగి రాజ ముద్రలు వేయును.)

రామా ప్రె — నిర్వక్ర పరాక్రమ ధుర్యులగు రెడ్డి, కమ్మ, బలిజకులభూషణులారా! ప్రాచీన వైభవమునకు పట్టు గొమ్మయు, ఆంధ్ర విద్యాపీఠముల కలంకారమును అగు నీ నగరలక్ష్మిని రక్షించుటలో తోడ్పడిన మీ భుజబలమును మెచ్చుకొనుచు మీ కీ సంభావనా శాసనము లీయబడుచున్నవి. (అని కొన్ని శాసనముల భటుని కీయగ రాజు శిరఃకంపమును గైకొని యాత డుద్యోగి కిచ్చి ముద్రలు వేయించును)

రామా ప్రె — మహారాజా! ఒకానొక వ్యక్తి యువరాజును హత్య చేయుటకు యత్నించినది. రాజకుటుంబముపట్ల నేర మగుటచే సది నిండుకొలువున విచారణ కాదగి యున్నది—

(భటులు బద్ధయై పురుష వేషమునను్న విజయాంబను ప్రవేశపెట్టుదురు)

రామా ప్రె — మహారాజా! ఈతనివృత్తాంతము కడు విచిత్ర ముగ నున్నదని యిదివరకే తమకు మనవిచేసికొని యున్నాను. ఓయీ! నీవు యువరాజులుంగారిపట్ల స్వామిద్రోహివై వారిని నిద్రలో నుండగ పొడిచి చంపు

టకు యత్నించినట్లు నీమీాద నేరము ఆరోపిత

మైనది. — దీనికి నీ వేమి చెప్పెదవు ?

విజయాంబ — ఏమియును చెప్పదలచుకొనలేదు. మీాఇష్టము వచ్చిన శిక్షను విధించిన దానననుభవించుటకు సిద్ధముగ నున్నాను.

రామాప్రె — రాజకుటుంబములోనివారి నెవరినైనను హత్య గావించుటకు యత్నించిన నేరస్థుని కన్నులను కనకన లాడు నినుపశలాకలతో పొడిచి కరచరణాదులను ఖండించు చిత్రవధ విధింపవలె నని శాసనము—

అనపోతా — మహారాజా! నా దొక్కమనవి యున్నది. ఒకసారి కృష్ణాతీరమున నొంటిగ కొందరు ద్రోహు లతో బోరాడుచు జీవితముపై నిరాశ చేసికొనియున్న సమయమున నడ్డుపడి నన్నితడు రక్షించెను. అట్టి యీా యకారణబాంధవుడు నన్ను వధించుటకు యత్నించె ననగ నేను నమ్మజాలకున్నాను.

రామాప్రె — నీవు నిద్రించునపుడు నీప్రక్కను గూర్చుండి ఖడ్గము నొరనుండి తీయుచుండగ నీతనిని నేను పట్టు కొంటినా ? లేదా ?

అనపోతా — కూర్చుండి ఖడ్గము తీయుచున్నచో నది యాత్మహత్యకై యుండును గాని యన్యవధకై యుండదే ?

రామాప్ర — ఆతని క్షేమమును గూర్చి యాతనిఁ దేసి పట్టు దల నీకేల ?

అనపోతా — ఒకవేళ నిరపరాధిని వధించినచో నది మన రాజ్యమున కరిష్టదాయకము గాదా ?

పో. వేమా — నాయనా ! ఇది విషమపరిస్థితివలె గనవచ్చు చున్నదే ! ఆతని చారిత్రమును గూర్చి యాతఁడు చెప్పడు ; మనకు తెలియదు ? ఇం కేమి గతి ?

అనపోతా — ఈత డొక పేదరాశి పెద్దమ్మ యింటిలో బస చేసినాడు. ఆమె నడిగినచో ఈతని వృత్తాంత మేమైనఁ దెలియవచ్చును.

(ప్రతీహారి తొందరగ ప్రవేశించును)

ప్రతీహారి — మహామంత్రిగారు నిన్న కారాగారమున బ్రవేశపెట్టిన ముసలమ్మ యొకసారి రాజదర్శన మిప్పించవలసిన దని పదేపదే మమ్ములను బాధించు చున్నది.

రామాప్ర — (రాజుతో) ఆమెయే పేదరాశి పెద్దమ్మ. (భటునితో) ఆమెను త్వరగ ప్రవేశ పెట్టుము.

(ప్రవేశము : పేదరాశి పెద్దమ్మ)

రామాప్ర — అవ్వా ! యీ పడుచువాడు నీ యింట నీ నడుమ బసచేసినాడుగదా ?

పే. పెద్దమ్మ — అవును బాబూ !

మునుబట్టి ఈమె స్త్రీయే కాని పురుషుడు కాడు. తల్లీ! విజయాంబ! ఇంకను దాపరిక మెందులకు ?

(పైవేషమును తీసివేయగ విజయాంబ స్త్రీరూపమున నిల్చును)

పో. వేమా — ఈమె సార్వభౌముని సన్నిహితబంధు వనిన మాట. అదిగో! ఆ వర్చస్సు చెప్పకయే చెప్పు చున్నది. ఎంత ప్రమాదము తప్పినది!

రామాప్రె — ఒకసారి నే నడుగగా ఈమె నీ పుత్త్రికా కుమారు డని చెప్పితివే ?

పే. పెద్దమ్మ — క్షమింపవలయును. ఇందులుగారి రుద్రరాజుగారి మరణసమయమునకు మాదానీడు సమీపమున నుండుటచే వా రాతనికి నీమె నొప్పజెప్పినారు. అప్పటి నుండియు నభిమానపుత్త్రికగ ఈమె నాతడు కొంచు కొనివచ్చినాడు.

రామాప్రె — యుద్ధసమయమున రాజాజ్ఞకు వ్యతిరిక్తముగ నీవు శత్రుపక్షమునకు సంశ్రయ మొసంగితివా ?

పే. పెద్దమ — ఈమె శత్రుపక్షమో మిత్రపక్షమో మీరే నిర్ణయించవలయును. యువరాజు మీది వలపుచే మాదానీనితో విరోధపడి మారువేషమున నీమె మన సీమ చేరుకొన్నది. తరువాతి యుదంతము లన్నియు మీకుం దెలియనే తెలియును.

రామాప్రె — అయినచో సీమ యువరాజును హత్య గావించుట కెందుల కంగీకరించినది ?

పే. పెద్దమ్మ — మహామాత్యులీమెను మొదటినుండియు నను మానించి ఈమెయెడ చూపుచు వచ్చిన కాఠిన్యమునకు ఈమె ఎన్నియోపర్యాయము లాత్మహత్య సంకల్పించుకొనగా నేను ధైర్యము చెప్పుచువచ్చితిని.

పో. వేమా — అయ్యయ్యో! పాప మెంత శ్రమపడినది !

పే. పెద్దమ్మ — బాబూ! ఈమె బొత్తుగ ముక్కుపట్టని ముత్యము. "ఎట్లయినను యువరాజుగారి సన్నిధిని ప్రాణమును విడువగలిగినచో ధన్యురాల" నని ఈమె నాతో పదే పదే చెప్పుచుండెడిది.

పో. వేమా — ఈమె యభిమానమునకు అమాత్యుల యనుమానమునకు సరిపోయినది. ఇప్పు డీ యుదంతము పూర్వాపరసందర్భములతో చక్కగ నెఱుకుచున్నది. ఇక చెప్ప నక్కర లేదు.

పే. పెద్దమ్మ — ఈసంగతి ప్రభువులకు విన్నవించుటకయి నేను తొందరపడితిని. ప్రభువులు నన్ను మన్నింపవలెను.

పో. వేమా — అవ్వా! నీవు మమ్ము దురితసముద్రమునుండి యుద్ధరించితివి. (రామాప్రెగ్గడతో) మనముకట్టాగ్రమున ధరింపవలసిన మాణిక్యమును నేలను బెట్టి కాలను రాయుటకు సిద్ధపడితిమిగదా ?

రామాప్రె — (అనపోతారెడ్డితో) కుమారా! నా యను
మానమే పరాభూత మయినది. నీ సాహసమే విజయ
మొందినది. (విజయాంబతో) తల్లీ! నీవు నన్ను
క్షమింప వలయును.

అనపోతా — రాజక్షేమమును గూర్చి మీరు వహించిన
దీక్షయే మీ కఠినవర్తనమునకు కారణ మని యిప్పుడు
గ్రహింపకపోయినదా?

పో. వేమా — సార్వభౌముని సన్నిహితబంధువును కోడలుగ
గైకొను భాగ్యము లభించునని కలలోనైన ననుకొన
లేను. తల్లీ! నీవు మా కులదేవతవు. కుమారా!

(అని అనపోతారెడ్డివైపును, మంత్రివైపును జూచును)

రామాప్రె — ఇరువుర యెడను చేసిన ద్రోహమునకు ఇరువు
రను నేనే సంధానింతును.

(అని విజయాంబ దక్షిణ హస్తమును దెచ్చి అనపోతారెడ్డిచేతిలో నుంచును.
అందరును పూవులు చల్లుదురు)

ఎఱ్ఱాప్రెగ్గ — కుమారా! మీ యిరువురి కల్యాణ మాంగ
ళ్యమే జాతికిఁగూడ కల్యాణమును గడించుగాక!

పంటలు లేని యీ భరతఖండపు భాగ్యము మోసులెత్త, వి
న్నంటగ జూచుకోరల సాంధ్రీయకోరము ఫుల్కరింపు, మా

పంటి స్వర్ణాభరణములకు పంటవుగా, విజయాంబికామణీ
మంటప మెక్కి పంటకులమంసిన! యాంధ్రధరిత్రి నేలుమా!

అన. విజ — మహాకవుల యాశీర్వాదమును శిరసావహించుచున్నాము.

ఎర్రాప్రెగ్గ — కుమారా! వివాహమునకు ధరించిన దీక్షా వస్త్రములే దేశసేవకుగూడ మీ దంపతులకు దీక్షా వస్త్రము లగుగాక!

పరదేశములయందు పరతంత్రబడబాగ్ని
  తనజన్మభూమి స్వాతంత్ర్యలక్ష్మి,
పరదేశములయందు పీనుగుపెంటలు
  తనమాతృభూమిలో జన్మసమృద్ధి;
పరదేశములయందు కరవుకాటకములు
  తనతల్లి యొడిలోన కనకవృష్టి;
పరదేశములయందు విషవాయుపూరంబు
  తనదేశమందు చందనసమీర;

యిట్టి జాతీయతను నిరసించివైచి
"యాత్మవత్సర్వభూతాని" యనుచు బలుకు
భరతజాతీయసందేశభరము దాల్చు
నాంధ్రసామ్రాజ్యనిర్మాత వగుము తండ్రి!

అన. విజ — మహాకవీ! వేదమంత్ర తుల్యమయిన మీ పవిత్రోపదేశమును పదే పదే జపించుకొందుము.

భరతమాతకు ముద్దులపట్టి, మమ్ము
గన్నతల్లి ; కవీంద్రుల కల్పవల్లి ;
బ్రహ్మవిద్యాధిరాజులపాలవెల్లి ;
యాంధ్రమాతకు మంగళ మగునుగాక !

(తెర పడును)

సమాప్తము.